THE

# Panchali Swayamvaram.

A TELUGU DRAMA IN FIVE ACTS.

COMPOSED BY THE LATE

**D. KRISHNAMA CHARLU**

"ANDHRA NATAKA PITHAMAHA"

*First Grade Pleader, Bellary.*

FIRST EDITION.

PUBLISHED BY

D. K. KRISHNAMA CHARLU & his BROTHERS.

BELLARY

PRINTED AT THE RAMA VILASA PRESS.

1918

శ్రీ

# పాంచాలీస్వయంవరము.

:o:

ఇది

బళ్ళారిలోనున్న డిస్ట్రిక్టుకోర్టు వకీలు

"ఆంధ్రనాటక పితామహ" యను బిఱుదునపొందిన

## ధర్మవరము-రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులవల్ల ప్రకటింపబడినది.

మొదటి కూర్పు.

బళ్ళారి

రమావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1918



[ క్రయము రూ. 1-0-0. ]

Krishnadev పీఠిక. Medical Student

Library 2 June 21

ఈనాటకమునందలి యితివృత్తము మహాభారతమునుండి గ్రహింపఁబడియున్నదని దీనిపేరే నుడువుచున్నది. సర్వజనసుప్రసిద్ధంబగు పాంచాలీస్వయంవరము నెందఱు వ్రాసినను పాత్రపోషణయందును సంవిధాన విధానమునందును భేదము లుండినుండుఁ గాని విషయభేద మెట్లుండఁ గలదు? కావున నిందలివిషయమునుగుఱించి హెచ్చుగఁ జెప్ప నవసరముండదు.

ఈనాటకమున నొకవిశేషముగలదు. ఇందు దశరూపుఁడను నవీనపాత్ర మొకటి కల్పింపఁబడి యున్నది. లాక్షాగృహదహనానంతరము కుంతీసమేతులైన పాండవు లేవురును మృతినొందిరని ధార్తరాష్ట్రిలాదిగ సమస్తరాజలోకమును నమ్మి యుండెను. బహుకాలమునుండి పాండవులలో నొకనిఁ జేపట్టఁ దలంపుగొన్న ద్రౌపదిహృదయమును నాపాండవుల మరణవార్త యత్యంతము దహించెను. ఆమె నర్జునున కొసంగ నెంచిన ద్రుపదనకును నాతనియర్థాంగికిని నుత్సాహ భంగమయ్యెను.

ఇట్టిసమయమున నా లక్కయింట దొరకినశవములలో నొక్కటి పాండవులది కాదనువృత్తాంతము బయలుపడియె. దీని వెలిపఱచినవాఁడే దశరూపుఁడు. వాఁ డాశవములలో నొకటి తనపితృవ్యపుత్రునిదని నిదర్శనపూర్వకంబుగ నిరూపించెను. కావునఁ బాండవులలో నొక్కఁడు తప్పించుకొని యుండవలయుననుట యేర్పడియె. దీనిచే ధృతరాష్ట్రునకుఁ దనకొడుకులపై ననుమానమును దుర్మార్గులగు సుయోధనాదులకు మనఃక్లేశమును విదురాదిసజ్జనుల కించుక సంతసము గలుగుటకుఁ గారణము గలిగె.

అంతయె కాక, ద్రౌపది ధీరపతివ్రత. అట్టిపతివ్రతలకుఁ దాము మనసునవరించినవారిని వివాహ మాడుటయో, యది సాధ్యము కాదేని

యీజన్మము బ్రహ్మచారిణులుగ నుండుటయో రెండే మార్గములు. కావునఁ బాండవులలో నొకఁడు జీవించి యున్నవార్త తెలియుటచే నిరాశమైయున్న ద్రౌపదికి మఱియొకసారి యాశాంకురము మొలచెను. ఈవార్త ద్రుపదునకును సంతోషజనకమయ్యెను. ఆబ్రతికిన పాండవుఁడును మృతినొందె ననుట యందాతని కేటికో పూర్ణవిశ్వాస మున్నట్లు తోఁపదు. కావునఁ దన కుమారిక నెవ్వరికి నీయక స్వయంవరము చాటించినయెడల నా తప్పించుకొన్న పాండవుఁడు తప్పక తత్స్వయంవరమునకు వచ్చిన రావచ్చుననియు, నాధీరుఁడే తనపుత్త్రికచే వరింపఁబడినఁ బడవచ్చుననియు నిశ్చయించి స్వయంవరము చాటించెను. కావున ద్రౌపదీ 'స్వయంవరమునకుఁ' గారకుఁడు దశరూపుఁ డనియే నుడువ వలసి యున్నది.

ఈనాటకమున నింకొకవిశేషముగలదు. ఏకచక్రపురినున్న జరాయు వనుబ్రాహ్మణుని యింటికి బకాసురునివంతు వచ్చురంగమున, యువతీవివాహ మవశ్యాచరణీయ మనునంశము చర్చింపఁబడి యున్నది. ఇది బాల్యవివాహదూషకులకు సహకారి కావచ్చును.

ఇఁక బాత్రసంపోషణమును, సంవిధాన విధానమును, సందర్భశుద్ధియు రసోచితశైలియుఁ బాఠకులకుఁ జదువఁ జదువ గోచరింపఁగలవు. ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితుఁడైన యాంధ్రనాటక పితామహుని నాటకరచనాచాతుర్యమును మరల వ్రాయఁ బూనుట చర్వితచర్వణ మగునని యింతటితో విరమించితి.

బళ్ళారి,
5-9-18.

ఇట్లు, విన్నవించు
నొక బుధవిధేయుఁడు.

# పద్యముల శుద్ధపత్రిక.

—:0:—

| పుట. | పఙ్త్రి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | చంపకమాల. | | |
| | 2వ చరణం. | వారగ. | వారఁగ. |
| | 3వ చరణం. | మహీశా. | మహీశ. |
| | 4వ చరణం. | లతులగు. | ల్లాతులగు. |
| | ,, | వారలై. | వారలే. |
| 7 | సీసము. | | |
| | 1వ చరణం. | గలిగె. | గలిగెఁ. |
| | 2వ చరణం. | భాదించు. | బాధించు. |
| | తే॥ గీ॥ | | |
| | 2వ చరణం. | ఘటింప. | ఘటియింప. |
| 10 | ఉత్పలమాల. | | |
| | 2వ చరణం. | చేరగఁ. | చేరఁగ. |
| | 3వ చరణం. | కారవు. | కారవు. |
| | 4వ చరణం. | యశ్లే. | యశ్లై. |
| | ,, | స్పృశింప. | స్పృశియింపఁగ. |
| 14 | సీసము. | | |
| | 1వ చరణం. | జెంది. | ఁజెంది. |
| | 2వ చరణం. | వృత్తాంతబు. | వృత్తాంతంబు. |
| | 3వ చరణం. | సోదెతకత్తెనె. | సోదెకత్తెనే. |
| 15 | తే॥ గీ॥ | | |
| | 2వ చరణం. | మేలుగ | మెలుఁగ. |
| ,, | శార్దూలము. | | |
| | 1వ చరణం. | భ్రాంత. | భ్రాంతా. |
| | ,, | జెల్లునె. | జెల్లునే. |
| | 4వ చరణం. | చెంతె. | చెంతే. |
| | ,, | మాటలనమ్మితె. | మాటలఁనమ్మితే. |
| 16 | అ॥ వె॥ | | |
| | 2వ చరణం. | వ్రాత. | వ్రాఁత. |
| ,, | తే॥ గీ॥ | | |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 17 | ఉత్పలమాల. | | |
| | 2వ చరణం. | కూతురిని. | కూఁతురి |
| | ,, | సెట్టివానికైన. | సెట్టినికై |
| | 3వ చరణం. | దలపంగలనె. | దలఁపఁగల |
| | ,, | యిఁక నెన్నడైనఁ. | యిఁక నెన్నఁడై |
| | ,, | కూరగ. | కూరఁగ. |
| 18 | సీసము. | | |
| | 1వ చరణం. | విధింపబడ. | విధింపఁబడి. |
| | 2వ చరణం. | గలగి. | గలిగి. |
| | 4వ చరణం. | వివాము. | వివాహాము. |
| 19 | | తే॥ గీ॥ | ఆ॥ వె॥ |
| | ఆ॥ వే॥ | యొంఁదో. | యొందో. |
| | ,, | సంకటములో. | సంకటములో. |
| | ,, | బఁరగి. | బరగి. |
| 23 | సీ॥ పద్యము | | |
| | 3వ చరణం. | సుతుఁతోఁనే. | సుతులతోనే. |
| | ,, | బొసఁగు | బొసఁగు. |
| 24 | తే॥ గీ॥ | నిందే. | నిందె. |
| 29 | తే॥ గీ॥ | పెక్కుండ్రఁగాంచి. | ఁబెక్కుండ్రఁగాంచి. |
| | 3వ చరణం. | ఁనాడ. | నాఁడ. |
| 30 | సీసము. | | |
| | 2వ చరణం. | బోరుబై. | బోరుపే. |
| 31 | తే॥ గీ॥ | | |
| | 1వ చరణం. | ద్యజంతు. | ద్యజింతు. |
| 33 | సీసము. | | |
| | 1వ చరణం. | దెంచు. | దెంతు. |
| | 3వ చరణం. | వారి. | వాఁరి. |
| | సీసము. | | |
| ,, | 2వ చరణం. | వాడు. | వాఁడు. |
| 41 | ఆ॥ వే॥ | | |
| | 4వ చరణం. | తెలయక. | తెలియక. |
| 48 | శా॥ | | |
| | 1వ చ... | | |

శ్రీ

# పాంచాలీస్వయంవరము.

## ప్రథమాఙ్కము-ప్రథమరంగము.

(హస్తినాపట్టముందరి బయలు).

[ప్ర: దశరూపుఁడు]

దశ — ఆహా! సర్వప్రయత్నముల నీవృత్తాంతము వెలిబెట్టుటకుద్దేశించి యీహస్తిపురి వలకు వచ్చి యిప్పుడేల యింక వెనుదీయవలయు? దుర్మార్గుఁడగు పురోచనుఁడును వానికి సహకారులైయుండిన వానిపతితభగినియు దానినలుగురు బోయకొడుకులును దైవయోగమునఁ దామేమార్గమునఁ బాండవులఁగాల్ప నెంచిరో యదేమార్గమునఁగాల్పఁబడిరి. ఇదిదైవచిత్రముగాక, యింకేమనవలయు? దురాత్ముల దౌరాత్మ్యమ్ముకడవఱకు నొకటే విధముగజరుగనేరదు. కొన్నాళ్లుజరిగినట్టేజరిగి "మాకింకేమి" యనిపించియెన్నఁడో యొక్కనాఁడు మూలఘట్టుగ నాశనమొనరింపకపోదు. ఈపురోచనుఁడు విషప్రయోగమున మాతండ్రిని సంహరించెఁగదా? తనదుడుకుతనమున నెందఱికొంపలకో ఉత్తర మెత్తె. తానేమిశాశ్వతముగ బ్రదికెనా? ఆయన్యాయ మూలముగవచ్చిన ద్రవ్యమింతైననిలిచెనా? ద్రవ్యమునకై యెన్నెన్నియో కార్యము లొనర్పుచువచ్చె. మిత్రుని తండ్రిని దమ్ముని సైతము ద్రవ్యమునకై వంచింపసమకట్టె. ఆద్రవ్యమే స్థిరమనినట్టే. అందుకై యాడిన యనృతముల లెక్కింపనలవికాదు. చేసినదుష్కృత్యముల నింతయని యుగ్గడింప వశముగాదు. తుదకు మహాధర్మపరులగు పాండుతనూజులదహింప నెంచిన లక్కయింటఁదానే దహింపఁబడియె. ధర్మాత్ముల దైవముకాపాడవలయుఁగాక యీతుచ్ఛులగుమానవులకు వారికిఁగీడొనర్చుటకుశక్యమా? లోకమునవెవరుగాని పురోచనువంటి దురాత్ములున్న-ద్రవ్యలోభమున నన్ృతములాడి ధర్మాత్ముల హింసచేయనుద్యమించు దురాత్ములున్న-వారికీ పురోచనునియంతమే మాతృకయగుంగాక. అదిగో! రాజసభలో నల్లోలకల్లోలముగా వార్త ధ్వానము వినిపించుచున్నది. పురజనులందఱుంబోవు చున్నారు. నేనుంబోయెద. సమయ నిరీక్షణమొనర్చెద. (నిష్క్ర-)

(వెనుక యవనికనెత్తఁగా)

ధృతరాష్ట్రుఁడు, విదురుఁడు, భీష్ముఁడు, ద్రోణుఁడు, కృపుఁడు, అశ్వత్థామ, దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకుని, కర్ణుఁడు, పౌరజనులు వారణావతము బ్రాహ్మణులు నుందురు (ప్రకటన) దశరూపుఁడు.

(అనుబంధము 1.)

ధృత—అయ్యో! పాండుకుమారులారా! నేనెంతహతభాగ్యుఁడ! అయ్యో! కుమారులు వారణావతమునుండి వచ్చుచుఁబోవుచుందురుగదా? కీర్తిమంతులై బ్రతుకుదురుగదా యని నమ్మియుంటిఁగాని, యిట్లనలముపాలౌదురని యెన్నఁడు నెంచియుండలేదుగా? అయ్యో! ఆయనలమునఁ జిక్కినకాలమున బాలకులెంత తపించిరో, నన్నెంత తలంచిరో, కట్టా! వారిదుర్దైవము వారినేగతికిఁదెచ్చె? అయ్యో! పౌరులారా! ఒక్కఁడైనఁ బాండవుఁడు బ్రదుకఁడుగా?

వా॥బ్రా—(ఏడ్చుచు) రాజేంద్రా! దహింపఁబడిన పాండవులయొక్కయుఁ, గుంతియొక్కయు శవములఁ గాంచితిమే యింకేటియాశ?

ధృత—ఆశవములగుఱుతు మీకెట్లుచిక్కె?

వా॥బ్రా—ఆయాఙ్కురును జతుర్దశిరాత్రి మహోత్సవముగఁ బూజచేసినప్పుడచ్చట నేయుంటిమి. రాత్రిసమయమునిండ్లకుఁబంపి శయనింపనిచ్చ్యక్తులైరి.

ధృత—అయ్యో! ధర్మతనయా! నీవెంతధర్మాత్ముఁడవని యీ యీడునకే ఖ్యాతిఁగంటివి. భీమసేనా! నీయట్టి మహాబలుఁడెందైననుండడే నే. అర్జునా! అయ్యో! నీయట్టి విలుకాఁడెందుఁగలుగవలయు? కవలారా! మీయట్టిధీరులును రూపజితమారులును, మాకెట్లుదక్కుదురు. అయ్యో! కుంతీ! నీపుత్రపంచకముతో నీవుంజేరికొంటివా హా! హా! (మూర్ఛిల్లును).

ద్రోణ—అర్జునా! హా అర్జునా! నీయట్టిశిష్యుఁడు నాకెప్పుడులభింపవలయు? ఇట్టిచిరుత వయసునకే, మహోన్నతప్రఖ్యాతిజెందినది యూరుపేరెఱుగకుండ నగ్నిలోదహింపఁబడుటకా! శ్రీహరీ! నేఁడెట్టిదుర్దినము! ఆయర్జునుఁడు నాకశ్వత్థామకంటె నెక్కుడనియుంటినే, నేనెంతటియభాగ్యుఁడ.

శకు—(దుర్యోధనునితో) ఇంకేమియుసందేహమువలదు. (ప్ర) అయ్యో! ఆపాండవులుంటి నప్పుడు తారతమ్యముల జనులెంచుచువచ్చిన స్పర్ధచే నొక్కొక్కవేళ నసూయజనించుఁగాని యయ్యయ్యో! వారికీదుష్ప్రాప్తి ఘటిల్లెనన్న నేనెట్లోర్వఁగలను?

దశ—(స్వ) ఆహా! ఎంతదుర్మార్గుఁడీశకుని! అందఱివలెఁదానును నేడ్చుచున్నాఁడే.

దుర్యో—అయ్యో! అయ్యో! నేభరింపఁజాల. భరింపఁజాల. అయ్యో! ఆపాండూరికి మేమయినఁబోవమయితిమే. గుణభూషణులగు పాండవులఁ గోలుపోవుసట్లాయెను. (ఎక్కువగా నేడ్చును).

దశ—(స్వ) ఘోరా! ఈనాటకము ఇంకఁదడయరాదు. ఈదురాత్ముల దుశ్చరితము వెలి పెట్టనేవలయు (బిగ్గరగా నేడ్చుచు ముందఱకివచ్చి) హా! రాజేంద్రా! రక్షింపుము. రక్షింపుము.

అందరు—ఏమి? ఏమి?

దశ—అయ్యా! నేనుగాంధారపురిలోనున్న శిల్పకారుఁడ దశరూపుఁడన్వాఁడ. లోన తీవ యుక్తిశాలియు, ధీరశాలియునని పేరొందిన మీవారణావతపురిలో సౌధములెల్లనిర్మించి ప్రసిద్ధిగాంచిన పురోచనుని పిల్పుకొన్నుపుత్రుఁడ. అయ్యో! మాపురోచనుఁడావురిలో నీకుమారునిపంపు నాలక్కయిల్లునిర్మించి దానితోఁగూడదహింపఁబడియె. కాపాడుము కాపాడుము.

భీష్మ—దశరూపా! ఈకొలువున నీవుమొఱయిడుట కేమికారణము? మాగారాన్నపను లగు పాండవులచావునకే కర్తవ్యము లేక వగచుచున్నాము. ఇఁకనీపురోచనునకేమి చేయఁగలవారము?

శకు—(దుర్యోధనునితో) ఇదేమి పురోచనుఁడు చచ్చెనను చున్నాఁడు.

సుయో—(శకునితో) ఉండవచ్చును. కాబట్టినేమే నాఁడుపోవ గానఁబడఁడయ్యె.

దశ—మహాత్ములారా! మీ నేవకులనఁగదా నాప్రియమిత్రుఁడును జ్ఞాతియునీల్గుటకుఁ గారణమయ్యె?

శకు—వానినీల్గుట కెవరేమిచేయఁగలరు? నేవయుందుండె. వేతనముగడయుచుండె. మేమె వరమైన వానిఁజావుకుంటిమా?

దశ—మీకృత్యములే వానిచావునకుఁగారణమయ్యెనయ్యా, లేకున్న వాఁడు సుఖముండి యుండును. వాఁడు దుర్మార్గుఁడునిజమే నేనొప్పుకొందును. అయినఁ దండ్రికొడుకే. అట్టివాని నిట్టికార్యమునకు నియమించిపంపితిరే.

శకు—నీకుఁదెలివిచాలదూరకపొమ్ము.

దశ—అయ్యా! నాకుఁదెలివిజాలదు నిజమే నాకంటె మాపురోచనునకింకను దెలివిచాలదు, కాకున్న మీరుచెప్పినంతమాత్రముననే ఇట్టిదుష్కార్యమునకుదిగి యూగితిదెచ్చు కొనునా?

శకు—(స్వ) వీఁడేమిసమీపమునకేవచ్చెను. ఏమోతెలియకయున్నది. (ప్ర) ఓరీ! ఇట్లు యేమిట్లుమాటలాడెదవు?

దశ—ధృతరాష్ట్రరాజేంద్రా! ఇంతవఱకువచ్చి యింకదాఁచవలయు నేల? మా రాజపుత్రుఁడగు శకునియు, నీకుమారులును, నితరులును దురాలోచనమొనరించి వారణావతమున లక్కయిల్లుఁగట్టించి పాండవులనందుదహించియున్నారు. ఆదహనకృత్యమొనర్చుటలో బురోచనునిసయితము గాల్చియున్నారు.

శకు / సుయో — ఛీ! దురాత్మా! నీవిట్లుప్రేలిన నీప్రాణములిప్పుడే తీసెదము. బాంధవునకొఱకు నీకెంతదుఃఖముండినను, ఇట్టిప్రల్లదము లూరకపోవనోర్తుమా? మా పురోచనుఁడు దహింపఁబడెనని యెట్లెఱిఁగితివి.

దశ—అయ్యా! కాలినయిల్లు ఐదు దినములప్పుడపఁ బరీక్షించుకాలమున, వానిశవముంగుఱుతించితి. ఇంకెంతకావలయు?

శకు—ఎక్కడనుండె వానిశవము?

దశ—అక్కడనే యాపాండవులును కుంతియుఁగాలిపడియుండిన చోటనే.

వా॥బ్రా—అక్కడ నాఱుపడియుండిన శవములు, వారే పాండవులని మేము నిర్ధరించితిమి. ఇఁకఁబురోచనుఁడెక్కడ? నీవునప్పుడుంటివే, పురోచనుఁడని చెప్పవైతివే.

దశ—ఎవరితోఁజెప్పి యేమిప్రయోజనము? పోనీ! ఒకశవము మెడయొద్ద నీబంగరుహనుమంతబిల్లపడియుండెనా, లేదా? (బిల్లనిచ్చును).

వా॥బ్రా—ఔను, అదియెవరిది?

దశ—రాజేంద్రా! పాండవులెవ్వరైన మెడలో యిట్టిహనుమంతబిల్ల వేసుకొనియుండిరా?

శకు—(పరీక్షించి సుయోధనునితో) ఇదిపురోచనునిదె, నేఁబలుమారు చూచియున్నాను.

సుయో—(శకునితో) అయినఁ బురోచనుఁడు హతుఁడయ్యె. ఒకవిషయమునకిది మంచిదేకదా?

శకు—(స్వ) అవును నాదుఃఖము మఱివేఱే. దానివిషయమై పిదపయోచింతము. (ప్ర) ఇదిపురోచనుఁడు వేసుకొనుచుండినబిల్లయె?

దశ—అయ్యా! వారణావతములో లక్కయిల్లుకట్టించినది దుర్యోధనరాజుగదా? లక్కయిల్లేల? పాండవులదహింపనేకదా? పురోచనునితో నీకార్యముచేయించినది శకునిరాజుగారుగదా? నామాటలనృతములా?

శకు—ఛీ! కుంటా! ఏలయీప్రల్లదములు?

సుయో—దురాత్మా!

కర్ణ—దుష్కర్మా!

దశ—అయ్యో! నేనేదురాత్ముఁడనుగా? ధృతరాష్ట్రరాజేంద్రా! ఇదిగోయీజాబు పురోచనుఁడు భాద్రపదకృష్ణద్వాదశినాఁడు శకునిరాజుగారికివ్రాసినది. అదియేటికో పంపక తనయింటనే పెట్టుకొనియున్నాఁడు. దీనిజదివిన నన్నియు విశదపడును.

సుయో—(స్వ) ఇదియే కాఁబోలు నావామాంగచలనమునకు ఫలము.

ధృత—విదురా! చదువుయిందేమున్నది.

విదు—(జాబుతీసుకొని)

"మీరత్యాదరమునఁ బంపినజాబుముట్టినది. అందువెంటనే పూర్ణిమనాఁడే ప్రత్యుత్తరమంపితిఁగదా ఇఁక రెండుదినములలో మీయొక్కయు, మీమేనల్లుండ్లయొక్కయు, వారిమిత్రులయొక్కయు, మనస్సంతోషము కాఁగలదు. దైవము మనకు సర్వానుకూలములు కలిగించుచున్నాఁడు. మనశత్రువులుఁ మనవలలోఁదామే పడనున్నట్లైనట్లున్నది. చతుర్దశి ఇక్కడ కార్యములు నెఱవేర్చి తమసన్నిధానమునకు బహుళ విదియ తదియలువచ్చిచేరుదు. నాసంవిధానమును, నాకుసహాయ్యమొనర్చువారి యధికశ్రద్ధయును, సమక్షమున విన్నవించి శ్రీదుర్యోధన రాజేంద్రునితోఁదగిన బహుమతివడయుదును"

అందరు—హా! హా!

ధృత—సౌబాలా! దుర్యోధనా! ఇందునకు మీరేమిచెప్పఁగలరు?

శకు—పురోచనుఁడు మారాజధానిలోనుండిన శిల్పికారుఁడు మిక్కిలి వివేకశాలి ఇంతెఱుగుదు. మాసుయోధనుఁడు తనకొఱకు వారణావతమునఁ గొన్ని చంద్రశాలలు నిర్మింపవలయునన్న వానిఁబిలపించి నియమించితి, ఇంతతప్ప నీవిధానమే, నే నెఱుఁగను. ఒక్కతోనుత్తమశిల్పులిండ్లుకట్టుట యెఱుఁగుదును.

సుయో—జనకా! ఆపాండువులందుబోవుటకుముందు మేమేయక్కడికిఁబోవ నిన్ననుజ్ఞవేడితినే?

చం॥ అతిశయరీతిఁ బాండవుల నచ్చటికన్పినవేళ వారణా।
వతపురిలోన క్షేమమొనలువారగనుండననుజ్ఞనిన్నుగో।
రితిమిగదామహీశ దురదృష్టముమించు టెకాకపాండవు।
లతులగువారలన్న నహహా యెవరైననునమ్మువారలె॥

శకు—బావా! ఈపురోచనునిజాబు వృత్తాంతమిప్పుడె తెలిసె. ఇదివానువ్రాసినదికాదని చెప్పవచ్చును. వ్రాసినవాడు దానిబంపక తనయొద్ద నేయుంచుకొనుటయెట్లు? వారణావతమువాఱంధఱు సంక్షుభవించి యీదశరూపుని లోఁచేసుకొని పాండవాభిమానముఁ యీకృత్రిమలేఖ కల్పించినట్లున్నది.

దుశ—రాజచంద్రా! అక్షరములు మూచిన తెలియదా? తీయింపుము రాజా? ఈశకుని రాజు గారియొద్దనుండవలయుగా మా పురోచనుజాబులు.

సుయో—ఏల యీతనితో వాగ్వాదము? అపరాధస్థాపనమునకుఁ బ్రత్యుత్తరమిచ్చినట్లు మాటలాడెదవే?

విదుర—రాజేంద్రా! ఈభీష్మాదులుపడుచున్న సంతాపము నీకుఁగన్నులుండి చూచుచున్న నెఱుఁగుచుంటివి. యౌవరాజ్యాభిషేకమునకు మున్నటినాఁడు జరిగినకలహమును నీవు కోపగించినవెంటనె పుట్టినయతివినయమును మఱవలేదుగదా? యువరాజ్యమునకాశించి యప్పటికిఁగార్యవాదులై యిచ్చకమొనర్చి వారణావతమున దుష్ప్రయత్నములెల్లనొనర్చి వారియంతమునకు సిద్ధముచేసిరి. నీవెట్లును గొడుకుల దూరముగాఁబంపవనియెఱిఁగి నెలమాటకు మేమే యక్కడికిఁబోయెదమని యడిగిరి. పాండవులు నిన్నును నీకొడుకుల నెడబాపుటకోర్తురా? కావున వారేమేముపోయెదమనిపోయిరి, ఇట్లైరి. అధికధర్మాత్ములై, మహోపకారపరులై, శరణాగతరక్షకులై యున్నపాండవుల కిట్టిపాటుకలుగఁగలదని నేనమ్మను. ప్రత్యక్షుని దర్శనములిన్నియున్నందున విధిలేకున్నది. ఇదియంతయు యువరాజ్యమునకై యొనరించిన దుష్కృత్యము. ఇంతయ్యు నాయువరాజ్యము మాత్రము దైవము లభింపనీయడు. వింటిమిగదా యేవురుపురుషులు నొకస్త్రీయు దగ్ధులౌట? ఆపురుషులలో నొకడు పురోచనుడయ్యెఁగదా? పాండుకుమారుడెవ్వడో యొక్కడు చావుదప్పియుండవలయుఁగదా.

అందరు—(సంతోషమునభినయింతురు).

శకుని—(స్వ) ఇదియే నాదుఃఖము.

సుయో—(శకునివైపునఁజూచును).

ధృత—ఆహా! ఇది యొక్కరును యోచింపనైతిమి. విదురా! ఈక్షణమున నాశ్వికుల నాయితపఱుపుము. దేశదేశములకుఁబంపుము. పాండవుఁడొకఁడైననున్నఁజాలు. —సౌబలా! నీనడవడియందు మిక్కిలి సంశయాస్పదమై యున్నదనుటకు సందేహములేదు. ఇంతనకెల్ల నీవును, సుయోధనుఁడునుత్తరవాదులై యుండఁగలవారు, కానిండు. ఇందుకు సరియగు ప్రత్యుత్తరము మీరివ్వఁజాలరేని, ఈపాండవులనంతము గావించుపాపము మీతలనేయుండుగాక. ఆచిక్కుగల పాండవేయుఁడెట్లు జరిగినదియుఁ జెప్పఁగలవాఁడుగదా? మాత్రము.

(యవనికపడును).

## ప్రథమాంకము-ద్వితీయరంగము

### శకుని ఇల్లు

---

శకు — (ఆలోచించుచు) ఈదశరూప యాచకము నేనెంచినట్లే యుండునా? ఇంకేమయిన నుండునా? అట్లుగాకున్నఁ బాండవులెల్ల బ్రతికియేయుండి యేదోయగమ్యమయిన సంవిధానమునకై ఈదశరూపుని నిట్లాడించియుండవలయు. ఈమాటింతవచించిన నీసుయోధనునికింక నిద్రపట్టదు పరితాపముమానదు. పాండవులుఁ బ్రతికియుండుట యెన్నటికైననుండునా? కాలినశవము లెక్కడరావలయు? బ్రతికియుండినవారేల ఇక్కడికిరాకుందురు? రెండేండ్లనుండి వారిపాలనవ తెలియఁబడకుండునా? నా యూహయేనిశ్చయము.

(ప్ర: సుయోధనుఁడు)

సుయో — మాతులా! నీప్రాపునాకుండఁగా నాకేమికొఱత? ఆప్రయాసముననే లగ్నమేర్పఱచినట్లువింటిని, యౌవరాజ్యమునకు.

సీ॥ ఆజన్మశాత్రవులై యున్న వారల పేరడంచుటకింతదారిగలిగె।
బగలురాతిరినన్ను బాధించు పాండవహృదయశల్యంబు హరింపఁగలిగె।
ధరణీపతులలోనసరిలేరునాకన్న యనుపమవిఖ్యాతితనరఁగలిగె।
మోదంబుతలఁగాఁగఁ జేదప్పియుండినయౌవరాజ్యశ్రీపాలియుడ
రఁగలిగె।

తే॥గీ॥ మాతులాయిది యెల్లనీమహిమగాదె।
మేలుఘటింపఁజాలు పాంచాలపుత్రి।
యింకమనసారననువరియించెనేని।
చాలునాభాగ్యమునకెందుసాటిగలదె॥

పోవుచున్నారు. (నిష్క్రమింతురు)

(ద్రుపదపురియుద్యానము.)

---

[ప్ర: కోకిల, మేనక. కృష్ణభార్గవి వనవిహార మొనర్చుచు.]

(అనుబంధము 2.)

కృష్ణ—అమ్మా! ఆకమలాకరము మనోహరముగానున్నది. దానిగట్టునఁ గూరుచుండుద మురమ్మ.

అందఱు—(పోయికూర్చుందురు.)

కృష్ణ—ఆహా! ఎంతస్వచ్ఛముగనున్నదీ నీరు (అని నీటియొద్దకుబోవ.)

మేనక—అమ్మా! ద్రౌపతీదేవీ! ఆనీటికంతసమీపముగాఁబోయెద వేల?

కృష్ణ—మేనకా! నాకేమీతరాదనియెంచితివా?

మేనక—ఎంతవచ్చియున్న నేమి జారిపడినప్పుడు కాళ్లకుచీరచుట్టుకొన్న నదేపోఁతగా? కోకిలాదేవి! చూడుము మీకూతురు నీటికెంతసమీపమునకుపోవుచున్నది. సాహస కార్యమొనరింపవలయునన్న ముంగాలు పెట్టినడుచుచున్నది.

కోకిల—కృష్ణా! పోకుమిక్కడరమ్ము.

కృష్ణ—అమ్మా! యీమేనక మిక్కిలిభీరురాలు. ఏదిచూచినను దానికిఁగొండగాఁదోచును. నీవును నదిచెప్పినట్టేయాడెద వేల?

మేనక—అమ్మా! ఎంతధీరత్వము నీకూతురికి ఒకనిమిషమూరకుండదు. ఒకచోటగాలిడి యుండదు, ఎంత పెద్దవారినైనను హాశ్యములాడుటకు కాస్పదమయ్యెనా మానకహాశ్య మాడును.

కృష్ణ—చాలునులేనే మేనకా వర్ణించి వర్ణించి యుగ్గడింపసాగితివి. అమ్మా! యీమేనక యిష్టప్రకారము ప్రవర్తింపవలయునన్న మనముమాటలుమరచి మూగలూకావలయు.

(అనుబంధము 3.)

కన్నులెప్పుడుమూసుకొనియుండవలయు. చెవులతో నొకమాటవినరాదు.

మేనక—ఈపదునాలేండ్లయీడునకే యీవెలది ఎంత నేర్చినదమ్మా! యీమెకెట్టిమగఁడు రానున్నాడో!

కృష్ణ—అవునులే. అంతేమియోచింపకుము నీమగనికంటె నెవరిమగండయినను మేలుగనే యుండును.

మేనక—చూచితివమ్మా? ఈయమ దుడుకుతనము. ఉదయమునుండి సాయంతనము వరకునిట్లే.

కోకిల—కృష్ణా! ఊరకుండుము. ఇట్టిమాటలాడరాదు. మేనకా! సాయంకాలమయ్యె. ఇంకను నాయెఱుకసాని రాదెయ్యె.

మేనక—ఈయుద్యానవనమునకే పిలిచికొనిరమ్మని పంపియుండలేదా? ఇంతలోననే రాఁగలదు. అమ్మా! ఆయెఱుకత చెప్పుసోదె నేనెందును వినియుండలేదు. అంతటి నైపుణ్యమును నంతటి భూతభవిష్యత్ జ్ఞానమును నావనిత కెట్లుగలిగెనో?

కోకిల—మేనకా! అదియయిన సదుత్తరము చెప్పిన నానందింతును. తనయకుఁబదునాఱు నిండె. యౌవనమునిండ నారంభించె. ఎందెందు వెదికినను ననుకూలవరుఁడే తోఁప కున్నాడే. అయ్యో! అర్జునునకివ్వవలయునని నాకెంతభిలాషముండెను. అంతయు వితయయ్యె.

(అనుబంధము 4.)

మేనక—అమ్మా ఎన్నిమాఱులో యోచించితిమే చేదప్పిపోయినపదార్థ మెట్లు మరల లభింపఁగలదు? అర్జునుఁడు కాకున్న మఱియొకఁడాయె. మొన్ననే ధృతరాష్ట్రునొద్దనుండి బ్రాహ్మణుఁడువచ్చియుండెఁగదా దుర్యోధనునకీకన్నియ నడుగుటకు? నాకేమో యది యనుకూలమైనచోటనియే తోఁచు. ద్రౌపదీదేవీ! దుర్యోధనుని పెండ్లిచేసికొనుము.

కృష్ణ—చాలునింకూరకుండుము.

మేనక—ఏమమ్మా యతఁడేమిసామాన్యుఁడా? గొప్పరాజకుమారుఁడు వాఁడేయిప్పుడు రాజ్యమంతయు నేలుట. ముందుయువరాజు కానున్నాఁడు. కొన్నాళ్లలోనే రాజ్యమును రాఁగలదు. సుందరవిగ్రహుఁడు. ఏమిటఁదక్కువ?

కృష్ణ—ఏమిటందక్కువకాకున్న నీవేచేసికొనుము.

మేనక—చూచితివమ్మా?

కోకిల—కృష్ణా! ఊరకుండు మిదిసరికాదు.

కృష్ణ—చూడు మఱియెవరినెవరినో పెండ్లియాడుమనుచున్నది.

మేనక—నేనన్నదితప్పా ఆధృతరాష్ట్ర పీఁటనున్న యందఱి రాకొమరులపటములు మొన్నఁజూడలేదా? వారేమైనారు.

కృష్ణ—ఇంకనీమాటలాడకుము ఆపటములఁజూచితిమిగదా? అందులో నెవ్వఁడో సూతసుతుఁడంటివే వానినైన నేనంగీకరింతుఁగాని యాధార్తరాష్ట్రులఁగాలితో నైనస్పృశింపను.

కోకిల—ఛీ! ఆమాటనకుము మేనకా! వారురాజపుత్రులేయగుదురుఁగాక నిరపరాధులైన పాండవుల దుర్యోధన, కర్ణ, శకునుల లక్కయింటదహింపఁజేసిరని మనమువినలేదా?

వారెంతకైనఁదగినవారుకదా అట్టివారి సంబంధముచేయుమంటివా ? కృష్ణ యన్నమాట నిక్కము. వారుకాలిచేనైన స్పృశింప నర్హులుగారు.

ఉ॥ వంచనయుక్తదురాకృతమువైరమునిండఁగఁబాండుపుత్రులన్ ।
మించినకూరకృత్యమునమృత్యువుచేరఁగలక్క యింటఁగా।
ల్పించిరికారవుల్లగముఖీతిలవారలుకృష్ణయన్నయ ।
ట్లెంచఁగఁగాలనైనస్పృశింపఁనర్హులుగారుభామినీ ॥

మేనక—ఆయిన మీయిష్టము.

కోకిల—ఆతప్పిపోయిన పాండవుఁడెవ్వఁడో, యెందున్నాఁడో, అదియిన్నాళ్లయ్యఁదెలి యక్కదిగదా ? అతఁడర్జునుఁడైయుండరాదా ?

మేనక—అతఁడర్జునుఁడైయుండిన నిన్నినాళ్లు తనబాణానలమున ధార్తరాష్ట్రశుష్కవనము దహింపక దాగియుండునా ?

కోకిల—అర్జునుఁడుకాకున్న నింకొరుఁడైనను బాగుగనేయుండెఁగదా ? ఏమియు వారి పొలకువ తెలియకయున్నదే ?

(లోపలధ్వని " గద్దెవినరే " యని)

మేనక—అదిగో యెఱుకతవచ్చినట్టయ్యె. ఆచోటఁగూర్చుందము.

కృష్ణ—భార్గవీ ! వీండ్రుమగలచింతలోఁబడి గద్దెయడిగెదరు మనకదివలదు. అందుబోయి వన వినోదములఁజూతమురమ్మ.

భార్గవి—ఏలమ్మా ! వీరేమిమాటలాడెదరో విందము. ఇందేయుందము. ఈయెరుకసాని మిక్కిలి సమర్థురాలని యూరందఱును చెప్పుచున్నారు.

[ప్ర: ఎఱుకసానిఁపాడుచు]

(అనుబంధము 5)

కోకిల—రమ్మా ఎఱుకసానీ కూర్చుండుము.

ఎఱుకసాని—సోదెడుగుతావమ్మ.

కోకిల—అవును.

ఎఱుక—బియం బేళ్లు పండ్లుదచ్చిన వక్కాకు తెచ్చిపెట్టూ. యీావుల్లముట్టూ.

కోకిల—(అన్నియునిచ్చి పుడుకజేపట్టును).

ఎఱుక—కొల్హాపురమ్మ, కొల్హాపురమ్మ, అలంపూరమ్మ, జోగులమ్మ, హోసూరమ్మ, రావమ్మ, రావమ్మ, నామచ్చులోనిండవమ్మ, ఓళవ్వా, నీవెగద్దెడుతవా! నన్నే శెప్పమంఠవా?

కోకిల—నీవే చెప్పుము.

ఎఱుక—అమ్మో-యమ్మా. కొల్హాపురమ్మా తోడునీకు పెద్దచింతమ్మా. పెద్దచింతమ్మా. యేమి చింతని అడుగుతవా, శప్పమంతవా, మొగోణిచింతమ్మా. మొగోణిచింతమ్మా.

మేనక—అట్లన్న నేమి?

ఎఱుక—తన మొగోణిచింత కాదమ్మా. (యోచించి యోచించి) ఓహో ఓహో కొల్హాపురమ్మ తోడు శప్తా చిన్నబిడ్డ ముద్దుబిడ్డమ్మా. అవునంటే అవునను. కాందంటే కాదను.

మేనక—అవును లే.

ఎఱుక—అవునమ్మా ముద్దుబిడ్డకు మొగోణి చింత. ఓళమ్మ. ఆరేండ్లనించి యీచింత పుట్టిందమ్మా అవునంఠవా? అలంపూరమ్మ అలంపూరమ్మ వకఅయిదుమందిలో అనుకుంట్వికదమ్మ. వాండ్లుపద్దన్నారమ్మ. కాదు. ఆహా హా వద్దన్లేవమ్మ కానాకుండా పోయినారమ్మ. కాదు. కాదు. కొల్హాపురమ్మ. వాండ్లుసచ్చిపోయుండారమ్మా.

కోకిల—అందుఱూనా?

ఎఱుక—కొల్హాపురమ్మ. కొల్హాపురమ్మ. అంధరుపోయిండాగమ్మ. అవుతే వగరు ముగిలిండారనుకొంతారమ్మ. కల్లమ్మ. కల్ల. కొల్హాపురమ్మ శెప్తాది. అందఱు పోయుండాగమ్మ.

కోకిల—హా దైవమా.

ఎఱుక—బయపడాకొళ్లమ్మ. నీబిడ్డ మంచిబాగ్యవంతురాలమ్మ. అంతకంటె మంచిమొగోణ్ణి పొందుతాదెమ్మ. మీరుయెవరినో శేసుకోమంటిరమ్మ. మీరెవర్ని వద్దంటిరో వాడే మొగుడౌతాడమ్మ. దొడ్డవాడమ్మ. బవుదొడ్డవాడమ్మ. దొడ్డరాజ్యం వస్తాదమ్మ. యెంత సంపతమ్మ. యెంతసంపతిమ్మ?

మేనక—వాఁడెవఁడు ఎక్కడనుండువాడు?

ఎఱుక—నాకేమెరికెమ్మ. మీకేదెల్సునమ్మ. ఓళ్లమ్మ. ఆతూర్పులోవుంటడమ్మ. బలే బలే బలగమమ్మ. పేరుశెపమంఠవా? కొల్హాపురమ్మ. పేరట్లశెప్పదమ్మ. మొదటి అచ్చరంశెప్తందమ్మ. కొల్హాపురమ్మ. స"—ద" రెండుచ్చనామ్మ. రెండుపేగ్లమ్మ కడచ్చరం "న"

మేనక—తెలిసె నిజమే అయిన వాఁడు మిగులదుర్మార్గుఁడనియు దసయన్నదమ్ముల ద్రోహము చేఁజంపినాఁడనియు నందురే?

ఎఱుక—కొల్హాపురమ్మ. కలమ్మ—కల్ల. కడుపుగాకపుట్టించిండారమ్మ. మానుబావుడమ్మ. మానుబావుడు.

కృష్ణ—ఏమి వెఱ్ఱిపట్టినదే మీకు? ఎఱుకసానీ! వారడిగినదియట్లుండనీ. నేనొక్కటియడిగెద చెప్పుము. (పుడుకపట్టును)

ఎఱుక—తాల్లూ. ఆ అన్నదై పోనీ.

కృష్ణ—అయన్నది అయిపోయినది. చెప్పుము నేనిప్పుడేమనుకన్నానో మనసున?

ఎఱుక—కొల్లాపురమ్మ. నీకు మొగోణిచింత.

కృష్ణ—ఎవరికుగనిచింత.

ఎఱుక—అదేమిట్లసి కాదవు. నీ మొగోణిచింతేగా?

కృష్ణ—కాదే యిట్టియబద్ధములు చెప్పకుండ నీమగడు నీనోటిపైఁ జెప్పున నెప్పుడుకొట్టువాడని నాప్రశ్న

ఎఱుక—బాగాయమ్మ. నీకువక మొగోడుచాలడమ్మ.

కృష్ణ—తులవా యిట్టిమాటలాడెదవా?

(లోపలఁగొమ్మునధ్వని).

మేనక—అదిగో రాజుగారిసావరి. యీసరోవరమునకు వచ్చునట్లున్నది.

కోకిల—అయినఁబోవలయు. యెఱుకసానీ రేపుమరలమాటలాడుదము.

(అందరు నిష్క్రమింతురు.)

—:ప్రథమాంకము సమాప్తము:—

శ్రీ

# పాంచాలీస్వయంవరము.

—:o:—

## ద్వితీయాంకము-ప్రథమరంగము.

ద్రౌపది యంతిపురి.

[ప్ర: ద్రౌపది. మేనక]

ద్రౌప—మేనకా! ఈతాపమెట్లింక సహింతును?

మేన—తనయా! ఒకకలకై యింతపరితపించువారి నెందైనఁగంటిమే? మొన్న నాయొఱకతవచ్చి యూరకగద్దెచెప్పినందున నాకలవరమునకే యిట్టికలవచ్చెను.

ద్రౌప—కాదే మేనకా! ఆకలలోఁ జూచిన మనోహరాకారుని నెందెదుఁజూచియుండలేదే, అయ్యో! అట్టివాఁడు నాకెట్లులభింపవలయు?

మేన—ఇదేమమ్మా! కృష్ణా! నీవెందరికోబుద్ధిచెప్పుదానవె? నీకాయిట్టియవివేకము. కలలలో నెన్నియోపదార్థములబ్బినట్లుండును అవియల్ల నిక్కవములౌనా? చూచిన వారందరు భయపడునట్లు నటించెదవు. నీచిత్రమోహముచూచి, నేనప్పుడే మీతల్లిదం డ్రులయొద్దకు దాసింబంపితి. నింతలోననే వత్తురూరదుము.

ద్రౌప—హా! మేనకా! ఎంతతాపమయ్యెనే! ఏన్నడు నెఱుఁగఁగదె? హా! మనోహరా! (మూర్ఛిల్లును).

మేన—హా! కృష్ణా! కృష్ణా! (అనిమూర్ఛిల్లియున్న ద్రౌపదికి శిశిరోపచారములు చేయును).

## (ప్ర: ద్రుపదుఁడు కోకిల.)

ద్రుప } కృష్ణా! కృష్ణా!
కోకి }

## (అనుబంధము 6.)

ద్రుప—ఈయర్ధరాత్రమున నిట్టియుత్పాతమెట్లుపుట్టెను?

మేన—రాజేంద్రా! నేనునిందే శయనించియుంటిఁగదా? "హా"యని యీకృష్ణయెట్టేలేచి పలవరింపసాగె. కలలోనొక్కసుందర విగ్రహునిగాంచెనఁట. అట్టివానినేనెన్నఁడు చూతునని దుఃఖించె. వికారవిధమున వర్తింప మీకుఁజెప్పనంపితి. ఇపుడుమూర్ఛిల్లియున్నది.

కోకి—ఏమివైపరీత్యము! నాథా! శీఘ్రకాలముననే యీతనయకుఁ బరిణయముకావింపవలయు. కృష్ణా! కృష్ణా!

ద్రౌప—(కన్నులువిచ్చి) ఏమమ్మా!

## (అనుబంధము 7.)

కోకి—మాయమ్మా! ఇట్లేలఁజేసెదవె? కృష్ణా! నీవుమూర్ఛిల్లితివేల? నేనెట్లదిసహింతును.

ద్రౌప—అమ్మా! నాకుఁగొంచెము నిదుగవచ్చుచున్నది ఊరకుండుము (కన్నుమూయును).

ద్రుప—కోకిలా! బాధపెట్టికము నిద్రపోవనిమ్ము.

మేన—అమ్మా! నేనుమన్మథపూజయొనర్పఁ బదార్థములు సేకరించెద.

(నిష్క్ర).

కోకి—నాథా! ఇంకెట్లుచేయవలయు?

ద్రుప—ప్రాణేశ్వరీ! తెలిసె పాండవులలో నొక్కరివరింపవలయునని నాకును, నీకును, నీకృష్ణకును బూర్ణభిలాషముండె. లక్షాగృహదహనముపిదప నొకడెవ్వడో పాండవేయుఁడు మనియున్నట్టుతెలిసి యింతయూరడిలియుంటిమి. అటుచావుదప్పిపోయిన

వాఁడు ధర్మసుతుఁడనియు, నతఁడును మృతిఁజెందెననియు నిన్న నేకదా మనకుఁదెలిసె. అది యీకృష్ణవిన్నకతమున నీయవస్థఁజనించె.

కోకి—నాథా! లోకమునలేనిపాండవు లెక్కడనుండిరాఁగలరు? వున్నవారిలోననే చూడవలయుఁగదా! సుయోధనునకొసెంగెదమని ధృతరాష్ట్రునకే చెప్పిపుత్తెను.

(అనుబంధము 8.)

ద్రుప—ఏమీ! మహాక్రూరచిత్తులనియు, ద్రోహవర్తులనియు, నీవేమెంతోదూషించుచుంటివే?

కోకి—మనమువిన్న వృత్తాంతములఁబట్టి వాఁడు ఘోరకృత్యమొనర్చినవాఁడని యాభంగి మాటలాడుచుంటి.

ద్రుప—ఇపుడేమైన నందుకుభంగముకలిగెనా? పాండవులు తామే లక్కయిల్లుకట్టించుకొని కాల్పించుకొనిరా?

కోకి—ఆమాటకుఁగాదు నీతోఁజెప్పఁగూడదనియేయుంటిని. చెప్పిననేమియుదోషములేదు. యిప్పటికొక రెండునెలలముందీయూరికొక సోదకత్తెవచ్చియుండె. దానిప్రభావమూరంతయునగ్గింప నేనుంబిలిపించితి. మనసుననున్న యభిప్రాయములన్నియు నాయెఱుకతవల్లించె. ఆసుయోధనుఁడు నిరపరాధియనియు, నాబిడరూఢిగాజెప్పె. నమ్మకున్న విధిలేకున్నది.

సీ॥ పురివారలెల్లనమృతముఁజెందెదురీతి
నెఱుకచెప్పెడునొక్కయెఱుకసాని।
మహిమతోనటుమొన్నమనవీఁటికరు
దెంచియున్నవృత్తాంతమువిన్నయంత।
నాసోదెతకత్తెనె నారామసీమకుఁగడఁగి
రప్పించితిగద్దెయడుగ।
వచ్చియయ్యెఱుకతయచ్చెరువొంద
నామెంచినవిషయంబులెల్లఁజెప్పె।

తే॥గీ॥ ఏభ్రమను బాండవులు గతజీవులనుచు।
నేక సుయోధనుఁ డపరాధ మేమిఁ గఁడనుచు।
నెంతయు ద్రికాల వేది నీ కుంతి చెప్పె।
దానినమ్మితి మదిని నేఁ బ్రాణనాథ॥

ద్రుప—బ్రాంతా! ఇట్టి సోదెలకుఁ బ్రాలుమాలితివా? ఎంతటియవివేకము ఇట్టిసోదెలు నిజములగునా? ఎన్నటికి నినమ్మకుము. ఎఱుకతయఁట? సుయోధనుఁడు నిరపరాధి యని చెప్పెనఁట? ఆసుయోధనుఁడే యావేషమున నేలవచ్చియుండరాదు.

శా॥ భ్రాంత సోదెలనంగ నెట్టి వెఱుకల్ పాటింపఁగాఁ జెల్లునె।
యింతీ నీకు వివేకశూన్యత గదా యీగద్దెలం బట్టియున్।
కుంతీపుత్రుల కా సుయోధనుఁడు చేకూర్పండు మహాకార్యమం।
చెంతేయాతఁడుఁ దోషముద్దలపఁడం చీమాటలనమ్మితే॥

కోకి—చాలు లెమ్ము నాథా! నీచందము సుయోధనుఁడె యెఱుకతయైవచ్చునా అంతగ్రుడ్డి దాననా?

ద్రుప—అదియెట్లయిననుండనిమ్ము! కర్తవ్యము నారయుదము. సుయోధనుఁడునువలదు ఏసుయోధనుడునువలదు. రాగలమాసమునఁ గృష్ణాస్వయంవరము చాటింపఁబంపెద. రాజులందరుం జేరఁగలరుగదా? ఈకృష్ణయే, కనులారఁ దిలకించి యభీష్టవరునిఁ బడయుఁగాక.

ద్రౌప—హా! మనోహరా! హా! (అని కలువరించు)

ద్రుప—ఈబిడకు మంచినిదురమందు నొసంగవలయు నేవైద్యునిరప్పించి తెచ్చెద. నీవుపచారము చేయుచుండుము. (నిష్క్ర.)

(అనుబంధము 9.)

(యవనిక పడును).

## ద్వితీయాంకము—ద్వితీయరంగము.

(ఏకచక్రపురిలో బ్రాహ్మణునియిల్లు.)

[ప్ర: జరాయువు, హేమ, (కుశల, దీపకులు తోట్లలోఁ దూగాడుచు) ప్రక్కన భావాని (కుంతి)]

జర—కుమారా! దీపకా! నాకింతకంటె నేమిసంతోషముకలదు. ఎక్కడఁజూచినను నామిత్రులు నాభాగ్యముం బ్రశంసించుచున్నారు. పదునైదేండ్లయీడునకే నీకొడుకు వ్యాకరణ పరీక్షుండేటినాఁడుగదా? యిరువదియేండ్లలో నింకజతుస్తంత్రవేత్తయగునని పొగడసారి. అయ్యా! నీవిట్టిశ్రద్ధతోడనే రేపటినుండి తర్కశాస్త్రము నభ్యసింపుము.

(అనుబంధము 10.)

దీప—అయ్యా! మీయాశీర్వాదబలముండిన, నవశ్యముపఠియించి కృతార్థుఁడనయ్యెద.

హేమ—నాథా! వీఁడెంతశ్రద్ధతోఁ బాఠములఁజదువవలయునో, యంతశ్రద్ధతో నింకను బఠింపఁడు. నిత్యము సాయంతనమున దాదాపున యామమువఱకుఁ గాలహరణ మొనర్పుటమానఁడు.

జరా—దీపకా! కాలయాపనమేమి?

దీప—నీయనుజ్ఞగొని నేసాముచేయుటకై పోవుచుండలేదా? యొకగంట? ఆమాటకమ్మ యిట్లుకాలయాపనమనుచున్నది.

జరా—అట్లనా?

హేమ—మనకు బ్రాహ్మణులకు సామేలరా? యనిపలుమారు నెనఱచున్నాను వినడు. అందువలనఁబుణ్యమా, పురుషార్థమా?

ఆ॥ వె॥ భూసురులకుమాకుఁబుణ్యమోపురుషార్థ।
మోతలంపవలదెవ్రాతచదువు।
వదలిఫలములేనివ్యాయామమదియేల।
సాములేలవట్టిగోముగాదె॥

జరా—భ్రాంతా! ఈమాటనకుము. చిన్నప్పటినుండి శరీరదార్ఢ్యము కుదుర్చుకొనకున్న మానవజన్మమువ్యర్థము. శరీరదార్ఢ్యమున మనోదార్ఢ్యము వెంటనేకలుగు. అదియున్న నధ్యయనము మొదలొక్కని, యన్నికార్యములుకుమేలు.

తే॥గీ॥ ధర్మసాధనమునకెల్లఁదనువెకాదె।
మూలమింతటిభ్రాంతినీకెలగోల।
ప్రాకటశరీరదార్ఢ్యంబులేకయున్న।
నెల్లవిద్యలునేర్చిననేమిఫలము॥

హేమ—పంచాంగము చెప్పుకొను బ్రాహ్మణులకు మనకుశరీరదార్ఢ్యమేటికి? యుద్ధమాడవలయునా?

జరా—యుద్ధమాడవలసివచ్చినప్పుడాడనేవలయు. శరీరదార్ఢ్యము చాలనికారణమునఁగదా యందఱును మమ్ము బెదరించుచున్నారు, సామర్థ్యమే యొకటియున్న, మనకెంత గౌరవము? ఎంతజ్ఞానమహాత్మ్యమును, విద్యాపటిమ యునుండినను, నల్పసత్త్వులవుట వలన బలిష్ఠులగువారికంతయు మనము భయపడవలసివచ్చినది. ఆసామర్థ్యమేయున్న, నెట్టిస్థితిలోనుండియుందుమో?

హేమ—ఇది నీవొప్పినపని. ఇట్లున్నప్పుడు నేనెంతచెప్పినను వీఁడువినునా? పోనీ నీవు సింహపురమునకుఁబోయెదనంటివే, ఎప్పుడుపోయెదవు?

జరా—నాలుగైదు దినములలో నేఁబోవలయు.

హేమ—నాథా! నీకేమియు మనకుశలయొక్క చింతయేయున్నట్టులేదు? చూడుమీ తన్వికి పదుమూడేఁడులు నిండుటకుఁజొచ్చె. ఎవరైనఁజూచిన బిడ్డతల్లియనునట్లున్నది. ఇన్నాళ్లకును వివాహముకాకున్న నెట్లు?

## (అనుబంధము 11.)

జరా—ఏమిచేయవలయు? వెదకుచునేయున్నామే, వరుఁడెక్కడను లభింపలేదు.

హేమ—ఎక్కడనైన, నెట్టివానినైన నొక్కవరునిదెచ్చి వానికిఁగట్టి మనభారము వాపుకొనకున్న నెట్లు?

జరా—భారమువాపుకొనుటకని పనికిరానివానికీ ముద్దుకుమారిం గట్టుమంటివా? ఎన్నటికిని నాచేత గాదు.

ఉ॥ ఆరయఁబుత్రుకంటెను బ్రియంబుగముద్దొనరించి యొంతయుఁ।
గూరిమిఁబెంచి రాజిలిన కూతురిని న్నెట్టివానికైనఁగట్టినా।
భారముదీఱెనంచుఁదలపంగలనె యిఁక నెన్నడైనఁజే।
కూరగనిమ్ము మంచివరుఁగూర్చెదఁద్రిమ్మరి దేశమంతయుఁ॥

మొన్ననెంత ప్రమాదమగుచుండెఁజూడుము. ధారాపురముననున్న వానికిమాట యిచ్చుటకుంటిమే. కొంచము కాలవిళంబము చేసినందునఁగదా వానికిఁజూపు తక్కువగుట తెలియవచ్చె. గ్రుడ్డివానికింగట్టుచుంటిమే.

హేమ—ఔనుసరె. మఱియేదోయొక విధానమున శీఘ్రముగా నొనర్పకున్న నింతలోనే యీకన్య సమర్తాడిననెట్లు?

జరా—మరియుమేలయ్యె. మగనికి మిక్కిలి యనుకూలమయ్యె.

హేమ—అయ్యోనాథా! ఏమి మాటయందువు? మనబ్రాహ్మణ్యమేటఁగలయదా? తరువాత నెవఁడైన మగడువచ్చునా? వాడు వృషలీపతి యనిపించుకొనఁడా?

క॥ సుతయీడుమీఱెనేనా।
గతికిఁ బ్రాహ్మణ్యమేటఁగలయ దెపిదపన్।
బతియబ్బ నతఁడు వృషలీ।
పతియనఁగానెందుఁ దెగడఁబడఁడేనాథా॥

జరా—వృషలీపతి యయినవెంటనే కులమునకు బాహిరమగునా? ఏమోశాస్త్రములని యంగలార్చెదముకాని వానియర్థమే తెలియలేక తప్పుదారిం బోవుచున్నారము. బ్రాహ్మణులకు మాత్రమే కన్యా వివాహ మేదేవుడు వగదెంచి యున్నాఁడు మిగిలిన యన్ని జాతులవారును యువతీవివాహముల నొనర్చెదరుగదా? వారేమిచెడినారు? పెండ్లిలోఁబాను పని యొకయంగము నాల్గవ దినమునఁబెట్టి గర్భాదాన ఖండ చదివెదరే, ఏమిదానియర్థము? మొదటినుండియున్న యువతీవివాహము నెవరోనిష్కారణముగా నిషేధించి యవాచ్యకష్టములకుఁ బ్రాపైనబాలా వివాహము నాదరించినారుగాని దానియందు దోషమించుకైనఁగలదా?

సీ॥ బ్రాహ్మణజాతికే బాలావివాహ
మేదేవుని వలనవిధింపబడయెఁ।
గన్నియయువతిగాఁగలగినంతనె
దోషగరిమఁజెందుట కేమికారణంబు।
పెండ్లినాలవనాఁడు వెలయింపఁబడు
షానుపనునాగమంబునకర్థమేమి।
యెన్నిదేశములనోయెసఁగుఁగా
యువతీవివాహముల్చేడిరోకోవారలెల్ల।

తే॥గీ॥ నేమిమాటయెందో యెట్టికాలముననో।
యెట్టిసంకటములోఁ బుట్టుకతనఁ।
బఱఁగియుండెఁబోలుఁ బాలావివాహంబు।
దుఃఖదంబు శాస్త్రదూషితంబు॥

హేమ—మనమొక్కరమే లోకమున కరుదుగాఁ బుట్టియున్నారమా? అందఱు నేల బాలావివాహములనే చేసెదరు?

జరా—"గతానుగతికో లోకో నలోకః పారమార్థికః" అనుమాటవినమా?

హేమ—ఇట్లందఱు నాచరించు పథమును మనమతిక్రమింప వలయునా?

జరా—గుణమున్నయెడలఁ గావలసినభంగి సేతుచ్ఛేదమొనర్పనే వలయు. నేఁజెప్పెద వినుము. నాల్గు దినములలో సింహపురికేమో పోయెదను. అందున్నట్టి విన్నవరుఁడు సురూపుఁడుగాను ననుకూలుఁడుగాను నుండి యెక్కువ వరదక్షిణ కాశపడకయుండెనా యంగీకరించెద. లేకున్న నేనిల్లె యీకన్యం బెంచెద. ప్రౌఢ యయిన పిదపఁ దగినవాఁడె వశ్యమేతెంచి వివాహ మాడఁగలఁడు. దురాచారసేతుచ్ఛేదనమున కెవఁడైన నొకఁడేర్ప డవలయుఁగదా? నేనేయిందుకుఁ బూనెద. అప్పుడు వరదక్షిణలకు హరదక్షిణలకు శివదక్షిణలకు శవదక్షిణలకన్నిటికిఁ గుత్తారమెత్తినట్లగును. కాలక్రమమున గుణాగుణములఁబరిశీలించి యందఱు నాదరింతురు.

[ప్రః పతాకుడను తలవరి.]

పతా—అయ్యో! జరాయువయ్యా! ఏంటికయ్యా నీవీపొద్దు శీటీవేళ సోటికిరాలేదు?

జరా—పతాకా! వృత్తాంతమేమి?

పతా—పెద్దోళ్లంతా గలిశిండ్రి, శీటీలు దీశినూసిరి. రేపుమీయింటిశీటివచ్చింది, మీది వంతు శెప్పిరన్నుకొని పెద్దోళ్లు పంపిండారు.

అందరు—హా! దైవమా? (అనిమూర్ఛిల్లుదురు).

పతా—అయ్యో! మిడికేడేల. దైవమా అన్నాలె, భూతమా అన్నాలె, నేనేమో శెప్పిం డాను. మామిందమాల్లె పాయ్యొస్తానయ్యో రేపుమీదివంతు. మీదీవంతు. మీదే వంతు. తప్పాకండి. (నిష్క్రి)-

భవాని—(ముందటికివచ్చి) హా మాంబన్మ! ఏమీ వృత్తాంతము? ఎంతసంతోషముగా మాటలాడుకొనుచున్నవారు, మీవంతన్న మాటకే యిటుశోకింతురేల. వంతేమి?

హేమ—భవానిదేవీ! మేమేమిచెప్పఁగలము? ఇక్కడికామడ దూరములో బకుఁడను క్రూరరాక్షసుఁడున్నాఁడు. వాఁడుకొన్ని దినములక్రిందట నీయేకచక్రపురి నంతయు జనహించేసి భక్షించి పాడుచేయుచుండెను. జనులందఱేకమయి వానికిఁజెప్పుకొని దిన దినమును బండినిండ భక్ష్యాదులును బండికి కట్టిన జీవములను ఇంటికొకమనుష్యుఁడును సమర్పించునట్లు సమయమొనర్చినారు. ఈదినము మాయింటి వంతువచ్చినదఁట. నాథా! మనమేల దుఃఖింపవలయు. ఇదితీఱరానిపని. పతివ్రతలెల్లఁ దమకు సుమంగలీమరణము వచ్చునాయని కోరుచుందురు. నాకింక నీలోకమున నుండు కార్యమేలేదు. ననుజేపట్టినందుకు వంశమునిలుచుటకొక కొడుకును కన్యాదానపుణ్యము వడయుటకొక బిడ్డను గంటివి. అవశ్యము నేను దానవున కాహారమయ్యెద.

(అనుబంధము 12.)

జరా—అయ్యో! తన్వీ! ఇట్టిచందమునీకుఁదగునా? నీవులేకున్న నేనీచిన్నవాండ్రఁ బాలింపఁజాలువాఁడనా? మాతాపితృలిరువురిలో నొకరు మృతిజెందనే వలయునన్న గొన్నిచోట్లఁదల్లిపోవుటయే మేలగుట నిశ్చయమే, అదిచిన్నతనమున బిడ్డపాపలుకలుగకుండినప్పటిమాట. బిడ్డలుపుట్టి పెద్దవారైనపిదప వారిపోషణకుఁ దండ్రియేమియు శక్తుఁడుగాఁడు అప్పుడు తండ్రి పోవుటయే మేలు. నీవుయోచింపకుము. నేనే యాయసురకు నెఱయయ్యెద. కొడుకుబిడ్డలఁబోషించుకొనుచు సుఖముండుము.

(అనుబంధము 13.)

హేమ—నాథా! నీకునమస్కరింతు నీమాటనకుము. వేళకు బిడ్డలకింత కూడుపెట్టఁగలను గాని యాకూడుతెచ్చుశక్తి నాకుగలదా? కూటికిసంపాదనవలదా ననుక్షమింపుము. ఇదినాచేతగానిపని. నేనేపోయెద.

జరా—ప్రాణకాంతా! ఇదిమొఱకుదనమని నేనెంతు. నీకొడుకప్పుడే చదువరియైయున్నాఁడు, కావలయునన్న నిప్పటినుండి యే సంపాదన కర్హుడుగానుండఁగలఁడు, సంపాదనకెట్లు కొదవగలుగు? నేఁబోవుటయే యుక్తము. కుమారా! నీకీయీడునకే సంసృతి క్లేశము కలిగినందుకు మాత్రము వగచెదను.

(అనుబంధము 14.)

నీవింతశాస్త్రపరిచము వడసితివి కదా? ఇంకఁదర్కశాస్త్రము మానుకొనుము. అదిగో నామిత్రుడు ఆనకాచార్యుఁడు గొప్పశిల్పకారుఁడు. వానియొద్ద నీతెలివికారుమాసములలో నాశాస్త్రపాండిత్యము వడయఁగలవు. ఎక్కడెక్కడి రాజులును బ్రకృతము

సౌధములఁ, జంద్రశాలల, దేవాలయముల, నధికముగా నిర్మించుచున్నారు. ఆమూలమున నీకుఁబుష్కలధనార్జన మగును. బ్రాహ్మణుఁడనే, అట్టిపని నేఁజేయవలయునాయని సంశయింపకుము. అందువలనఁ బాపమేమియులేదు. జనులగౌరవనాశనమునకాస్పదమయిన యీమర్గర్వమువిడువవలయు. నాయాజ్ఞగా నియోంచి యావిద్య నేలువుము.

హేమ—నాథా! మఱియు నీమాటమానవే. నీవాయసురునొద్దకుఁబోవు టయుక్తము. చెప్ప నేవలసివచ్చినఁజెప్పెదను. నీకాపదగలిగిన, నేను సహగమనమొనరించుదానఁగాక మనియుందునా? అప్పుడీబుడుతలు మాతాపితృల నిరువురంబోవఁగొట్టుకొన్నవారగుదురే. ఊరక మాతనుమాత్రము పోవఁగొట్టుకొననిమ్ము.

జరా—హా! దేవీ! నీవునాకెంత సంతాపముదెచ్చుట కుంకించితివి.

దీప—జనకా! మాతయాడిన విధానమున నీతిగలదు. నామాటయింతవినుండు నేఁబోయెద నాయసురయొద్దకు.

జరా, హేమ—రామరామ! ఇట్టిదియుంగలదా?

దీప—నామాటసాంతముగావినుఁడు. నేఁబోయెద. నాకుబాహుబలము మెండగుటఁజేసి ఎట్లయిన నాయసురతో యుద్ధమొనరించి, వానినేలకుం దేఁగలనని ధైర్యముకలదు.

జరా—కుమారా! దీపకా! సామొనరించిసేకరించిన బాహుబలసంపదవలన నిట్టియాహా పురుషిక జనించెఁగాని, యయ్యయో! యాయసురయెక్కడ నీవెక్కడ? అజగజాంతరమే? చూచితివా? తన్వీ! వ్యాయామబలమెట్లనిపించుచున్నది?

దీప—మీరుపూర్తిగా నామాటవినరే. ఒకవేళ నేవానిజయింపలేకపోయి మృతిఁజెందినను, మీకుదక్కువగాదు. మీరిరువురు సుఖమున్న నాయట్టికొడుకుల నెందఱినోపడయవచ్చును. ఒకవేళ పుట్టకున్నను; కూతురుగలదుగదా? దౌహిత్రసంతతియే వంశవృద్ధి కావచ్చును. నాకింకడ్డమాడకుఁడు. (నే నేపోయెద.)

(అనుబంధము 15.)

కుశల—పితరులారా! సోదరా! మీమాటలేవియు యుక్తములుకావు తల్లిమృతిఁజెందిన జనకుఁడున్నట్టు సంసారమే భంగగతిఁజెందు. జనకుఁడుగతించిన నిరువురను బోవఁగొట్టుకొన్నవారమగుదుము. ఇకనీవన్ననో, ఈయీడునకే విద్యాధికుఁడవనిపించుకొని, విత్తార్జనమునకు సిద్ధముగానున్నాఁడవు. నిన్నుఁబోవఁగొట్టుకొని మనపితరులు దౌహిత్రులకు వేకరుచుండవలయునా? వార్ధక్యమున సంరక్షణము లేకుండవలయునా? ఇకనావిషయము లాలోచింపుఁడు. నేనెట్లును బరులస్వత్వమును. మీయింటనుండఁగలదాననుఁగాను. మఱియొకరింటికేగుటకు మూఱుగా బకునింటికేపోయెద. సంశయింపకనన్నంపుఁడు.

(అనుబంధము 16)

జరా—హా! దైవమా! ఎట్టిగతి తెచ్చితివి? కుమారీ కుమారులారా! అంటినఁబాలుగాఱు ముద్దుపాపలమిమ్ము గోలుపోయి మేముమనియుందుమా? పోవలసివచ్చిన మేమాలు మగల మిరువురుముంబోయెదముగాక, మిమ్మంపుదుమా? ఈమాటలాడకుఁడు.

(అనుబంధము 17.)

భవా—బ్రాహ్మణోత్తమా! మీయింటవసించియున్న నాలుగుదినములలోనే మీగుణగణములు గుర్తెఱిఁగి మిక్కిలి కృతపరిచయులమైయున్నారము. మీసంతాపము నేజూడజాల నాకేవురుకొడుకులున్నారు. వారిలోనొకరి నేనంపెద.

జరా—అయ్యో! అయ్యో! అమ్మా! అగునాయీమాట? పూర్వజన్మమున నెట్టిపాపములు చేసియుంటిమో యిప్పుడిట్లనుభవింపుచున్నాము. మాయేకచక్రపురికిని మాకును బకునకును దప్పదు. ఏపాపము నెఱుఁగనిబీదల మిమ్ముఁగోలుపుచ్చి రాఁగలజన్మమున నింకింతనుభవింపవలయునా?

భవా—అయ్యా! సంశయింపకుము. నామాటపాటింపుము.

హేమ—అమ్మా! వారునీకన్నకొడుకులేయగుదురా?

భవా—హేమాంబా! నీవడిగినమాట యర్థముంగ్రహించితి. నూర్గురుకొడుకులున్నను దల్లికిభారముకాదు. కావున నాకొడుకుచావునకు నేనొడంబడుదునన్న, నేఁగన్నవాఁడాయని నీవుసంశయింపవచ్చును. అమ్మా! నిక్కమువచించెదను. నాకొడుకొక్కఁడు మహాబలిష్ఠుఁడు. బకులు, గరుడులు, క్రౌంచులు వానికొకలెక్కలోనివారుకారు. వాఁడా బకుని నిరభ్యంతరముగ నిర్జించునని నమ్మికదా పంపెదనంటిని.

జరా—అమ్మా! నీపుణ్యమగు నూరకుండుము. ఆమహాసురుని మానవుఁడు నిర్జించువాఁడా! అదిగాక యీపురివారెల్ల బకునికి దినమొకరముగా మనఃపూర్తిగా సమర్పించుకొనుటకు సమయమొనర్చినారము. పోయినవాఁడెవఁడుగాని యుద్ధమునకుపక్రమించెనా వాఁడు చచ్చుటయట్లుండనిమ్ము ఊరంతయుఁదర్వాత నాయసురనాశమొనరించును. ఆపాపము నాయపకీర్తియు మాకుఁగలుగు.

భవా—అయ్యా! నాకుమారు బాహుసత్త్వము నేనెఱుఁగనా? నీవించుకయు సంశయింపకుము.

జరా—అమ్మా! ఆమాటెత్తకుము. నీవింకొకసారియట్లంటివా నీకునీపుత్రులయానగలదు.

భవా—(స్వ) అయ్యో! ఈబ్రాహ్మణుఁడనర్థకరముగ నానవెట్టెనే.

దీప—(స్వ) ఈపితరుల సమ్మతింపఁజేయుటయే యసాధ్యముగనున్నదే. ఇప్పటికింకొక యుక్తి వెదకెద. (ప్ర) జనకా! నాకొకటితోఁచుచున్నది. మనలోనొక్కరెవరైనఁ

బోవలయునన్న నింతకష్టముగానున్నది. ఱేఁపుబండిపై మనము నలువురముంబోవుదము, నలువురను బలిగా నాయసురకు సమర్పించుకొని నాల్గుదినములవఱకు నింకొకరిని బాధింపవలదని చెప్పికొందము. "నదుఃఖం పంచభిస్సహ" యనియున్నదికదా?

జరా—భళిరేకుమారా! ఎంతయుక్తి చెప్పితివి? నీవిద్యయూరకపోవునా?

హేమ—తనయా! మాకెల్లనెంత సంతోషమునించితివి. సుఖముగ మనమెల్లరము మృతుల మగుదము.

కుశ—అన్నా! నీయట్టియన్నయుండవలయుఁగదా. ఇదినాకును బరమప్రీతికరము.

(అనుబంధము 18.)

భవా—(స్వ) ఆహా! ఏమీదుఃఖము! వీరునలువురు జావనుద్యుక్తులై యిట్లు పెండ్లిసంతోషముననుభవింపుచున్నారు.

జరా—అమ్మా! భవానీదేవీ! మాయాపదకై నీకుమారునైనఁ గోల్పోవనిశ్చయించిన నీధీరగుణమునకు మేముగృతజ్ఞులమయితిమి. మాకెవ్వరుబంధువులులేరు. ఱేఁపు వివిధభక్ష్యాదుల నాయసురకై చేసి మేముకంఠపూర్తిగ భుజింపవలసియున్నది. నీవును నీకుమారులును మాకుఁబఙ్క్తిభోజనమీవలయు. నేనేమి విశేషమైన యాస్తినార్జించిన వాఁడఁగాను. ఏదోయీయిల్లును మాకుటుంబమునకుఁ జాలినంతవృత్తియు నున్నది. మీరును బీదబ్రాహ్మణులరు. మనఃపూర్తిగ నీధనమాన్యముల మీకొసంగెద. ఈయింటనేయుండి కారుణ్యమున మాయందఱపార లౌకికక్రియలనెఱవేర్చి సుఖముండుఁడు. ఱేఁపు బకునకు మీవంతువచ్చినప్పుడు నీయిచ్చవచ్చిన కుమారునిబంపెదవఁట లెమ్ము.

సీ॥ పరులకై తెగువనీపట్టినీనెంచినయుపకార
గుణమెంతయొప్పునమ్మ!
యరయనద్భుతమునీకరుణామహత్త్వంబు
సన్నుతింపఁగమాకుశక్యమమ్మ!
ఱేఁపునీసుతులతోఁనేపారమాయింటనొగిపఙ్క్తి
భోజనంబొసగుమమ్మ!
నాస్వత్వమెల్లనీనందనులంగీ
కరింపవారలకుబోధింపవమ్మ!

తే॥గీ॥ ఈగృహంబుకేయిల్లుగానెంచవమ్మ।
యొనరఁబుత్రులలోనింద దేయుండుమమ్మ।
నెమ్మిఁగడమాటయింతమన్నింపుమమ్మ।
మాకుసద్గతిఁగలిగించిమనుపుమమ్మ॥

భవా—(స్వ) హా! దుఃఖము. (ప్ర) బ్రాహ్మణా! మీద్రవ్యము నాకొడుకులాశింపరు నీయిచ్చవచ్చిన ధర్మకార్యముల కొసంగుము.

జరా—ఇదియేనాయిచ్చవచ్చిన ధర్మకార్యము. నీకొడుకులురానిమ్ము.

వెలుపల ప్ర: పాండవులు బ్రాహ్మణవేషమున.

“ రామచంద్రాయనమః ” యనుచు

భవా—(వెలుపలకువచ్చి కుమారుల నూరకుండమని సైగచేసి) కుమారులారా! ఆవైపునకుఁ బోవుదముకండు. చిత్రచరిత్రనంతయువచించెద.

(యవనికపడును).

—:0:—

## ద్వితీయాఙ్కము—తృతీయరంగము.

(బకునివిడిదికిఁబోవుమార్గము.)

[ప్ర: (భక్ష్యములఁబండితో) దీపఁకుడు ]

దీప—(బండిపైఁబోవుచు) ఇక్కడికిసంతోషమయ్యె. మావారుభక్ష్యభోజ్యములన్నియుఁ జేసిరి. అందఱమును భుజించితిమి. అపరాహ్ణము మీఱకుండ నసురఁజేరవలయునని సమయమఁట. మధ్యాహ్నమువఱకు దైవధ్యానమునకై తలిదండ్రులు దేవునింట సమాధిలోఁగూర్చుండిరి. ఇంతేచాలునని నాచెలియలిని మఱఁగించి యాబండిఁదోలుకొని వచ్చితి. మధ్యాహ్నమగుటకుముందె యసురయొద్దకుఁబోయెద. వానింజంపఁగలిగెనా సంతోషమయ్యె.

(అనుబంధము 19.)

నేజచ్చితినా యదియు మేలయ్యె. ఎంతచెప్పినను మావారు వినకుండిరి. నేనువచ్చుట కొప్పకుండిరి. కావున నిట్లొనర్పవలసివచ్చె. నాభాగ్యమెట్లున్నదో చూతము. అయిన మాయయ్య యనుటలో, నేచ్చుతుఁడనైతినేని యాయసుర సమయభంగముగా యుద్ధ మాడినందు కూరఁతయుఁ బాడుచేయఁగలఁడని నుడివె. ముందుమాటకు దైవమున్నాఁడు. ఆయసురతోడ లొలుతనే నాయుద్ధమితరప్రేరితము కాదనియు అందుకు నేమాత్ర ముత్తరవాదిననియు గట్టిగావచించెద. పిదప వానియిష్టము. (బండితోలుకొనిపోవును).

[ప్ర: శ్రీకంఠుడు (భీముడు).]

శ్రీక—ఆహా! నేనెంచినట్లేయయినది. మాతల్లి యాబ్రాహ్మణకుమారుని ధీరవాక్యముల నాశ్చర్యకరముగనుడివె. పదునైదేఁడులవాఁడుతానఁట, మహాసురుని సంహరించువాఁడఁట. ఇట్టిధీరులొక నూఱ్ఱురున్న నెంతదేశమునైన సాధింపవచ్చు. పైమాట కందు లుంబోవుదమని తల్లిదండ్రులనూరార్చి వారు దైవధ్యాన మొనరించుచుండ వారిని కన్నొఱఁగి తానసహాయుడై భక్ష్యముల శకటముందోలితెచ్చెఁగా! ఇదేకొత్తబండి జాడయగుపడియె.

(లోపల దీపకుఁడదలించును).

శ్రీక—అదిగో పశువుల నదలించుధ్వని వినఁబడియె. (పోయి ముందుపోవుచున్న బండిని కలిసికొని) అయ్యా! దీపకావధానీ! మీతలిదండ్రులతో నేమియుజెప్పకయే యిక్కడికి వచ్చితివే.

దీప—శ్రీకంఠశాస్త్రిలు చూచితిరా, నాయుక్తి బాగుగనున్నదా? నేఁజెప్పియుండిన మావారు నన్నువిడుచుచుండలేదు.

శ్రీక—పోని! ఇప్పుడేమాయె. నీవువెనుకకుబొమ్ము; నేనీబండిపైఁబోయెద.

దీప—సరె మంచిపనియాయె. మీయమ్మచెప్పియుండవలయునే, ఆపాపము మాకెందుకు.

శ్రీక—మీకేమియుఁ బాపమురాకుండ నేఁగాపాడఁగలను. ఆయసురను జంచి చెండాడి వత్తు లెమ్ము.

దీప—నేనును వానినట్లొనర్పనే పోవుచున్నాను.

శ్రీక—అయ్యా! నీధైర్యమునకు మెచ్చితి. అయినను నిది సాహసకార్యమొక్కటియే కాక ప్రయోజనకారికాదు. పోనీ! ఆయసుర నాకంటె బలిష్ఠుడుగా నుండవచ్చునని యెంచెదవా?

దీప—నీకంటె బలిష్ఠుఁడుగానే యుండవచ్చును.

శ్రీక—నాకంటె నీవు బలిష్ఠుఁడవనియెంచితివా?

దీప—ఏమో తెలియదు.

శ్రీక—నీచేతులనిట్లిమ్ము (రెండు చేతులఁబట్టి) ఇదివిడిపించుకొనుము.

దీప—(చేరగాదు).

శ్రీక—పోనీ! యిప్పుడైనవిడిపించుకొనుము. (పండఁబెట్టి కాలుసేతుల నొక్కచేతఁబట్టును)

దీప—(విడిపించుకొనలేకపోయి) అయ్యో! నీశక్తి నాశక్తికంటే మిక్కిలి యెక్కువ.

శ్రీక—అయిన నీవురాక్షసునితో నెట్లుకొట్టులాడెదవు.

దీప—ఏమో నాగతికొలఁదిబోయెదను,

శ్రీక—నీకుదెలియదు, లెమ్మూరక యింటికిఁపొమ్ము. నేఁబోయెద.

దీప—అదియెన్నటికిని గాఁజాలదు. నేఁబోవ నేవలయు.

శ్రీక—అట్లయిన నీతో సాంత్వనవాక్యములు పనికిరావు. (అని త్రాటదీపకునిఁగట్టి యొక చెట్టుఁనొద్దకుఁగొనిపోవ).

దీప—అయ్యో! నీపుణ్యము విడువుము. నీవునరమ్ము నేనునువచ్చెదను. అయ్యో! అయ్యో! (అని అఱచుచుండ మరుగున చెట్టునకుకట్టి బండితో ముందరికివచ్చును.)

(వెనుక యవనికనెత్త బర్వతారణ్యమున బకుని విడిదికనుపించును).

శ్రీక—(బండిదిగి) అబ్బ! అదియేకాఁబోలు నాకష్టాసురు నికేతనము. ఏమిశవ దుర్గంధము కలిగియున్నది. అయ్యెడకు నేఁ బోవలేను. కావలసి యున్న వాఁడేయిక్కడికిరానీ. ఈభక్ష్యములు నాకు వారియింటఁదిననివి తనివితీఱలేదు (అని భుజింపసాగును). (లోపల గొప్పధ్వని) అదియా! దురాత్ముని ధ్వని. అఱవనీ (తినుచుండును). (లోపల "ఏలరా యింకనురాలేదు" అని గొప్పధ్వని) వచ్చియున్నాను, వచ్చియున్నాను (అని మిక్కిలి గట్టిగానఱచును).

[ ప్ర: బకుఁడు. ]

బక—ఓరీ! దుర్మార్గా! నాయాహారము దినునంతదొమ్మ నీకుగలిగెనా?

శ్రీక—కొంచము తట్టుకొనుము శేషమింతయున్నది.

బక—రారా యీవలికి (గుద్దును).

శ్రీక—నిలుము, నిలుము. (అని తినును).

బకు—(తాడనమొనరించును) నేనెవఁడ నెఱుఁగుదువా?

శ్రీక—(భుక్తిముగించి యీవలకువచ్చి) ఇంకఁగావలసినంత మాటలాడుము).

(అనుబంధము 20.)

బకు—ఏవఁడవురా నీవు!

శ్రీక—శ్రీకంఠశాస్త్రిగారు.

బకు—(కాలదన్ని) శ్రీకంఠశాస్త్రీగాడో, నేనెవడ నెఱుగుదువా.

శ్రీక—కాలమాసన్నమైన బకరాక్షసుడవు.

బకు—నాకాలమాసన్నమా ? ఎవరురా నిన్నంపినది?

శ్రీక—నీయమ్మ మిండలలో గొందఱు.

బకు—అహా ! ఏకచక్రపురివారికింత పొగరుగలిగెనా. ఇంకవారికతి యేమానో ఎఱుఁగఁ గలరు.

శ్రీక—ఎఱిగియే యున్నారు.

బకు—ఏమెఱిఁగియున్నారు.

శ్రీక—ఈనాటినుండి తమపురము నిష్కంటకమాయెననియుఁ, జల్లగనిద్రవోవచ్చుననియు.

బకు—ఆహా ! దుర్మతీ ! ఇట్లుమాటలాడెదవా (అని పట్టును).

శ్రీక / బకు } (పిడిగుద్దులతో యుద్ధమాడి కలబడి బకుని శ్రీకంఠుఁడీడ్చుకొనిపోవును).

[ప్ర: జరాయువు, కుశల, దీపకుడు, హేమాంబ.]

అందరు—బకనిర్జరారి ! ఆబ్రాహ్మణునివలదు, వలదు, మమ్మెల్ల భుజియింపుము.

శ్రీక / బకు } (మరల రంగమునకువచ్చి గుంజులాడి బకుని శ్రీకంఠుడుక్రిందఁబడవైచి పైనగూర్చుండి సంహరించి ముద్దచేయును).

అందరు—శ్రీకంఠశాస్త్రీ నీకుమంగళమగుగాక. రక్కసుంకంబోవుదము. మాఁయూరు నిష్కంటకము గావించి పుణ్యముఁగట్టుకొంటివి. నీయుపకారభారమయ్యో. బ్రాహ్మణా ! ఇంతబలము నీకెక్కడఁగలిగె. నీవేమో మహాయంశపురుషుఁడవు. దీపకా ! నీవు వూరికి శీఘ్రముఁగఁబోయి మంగళవాద్య పురస్సరముగఁ నూరివారినిరమ్మనుము.

దీప—పోయి మంగళవాద్యములతో నందరిని పిలుచుకొనివచ్చి యదురైఁ యందఱు శ్రీకంఠు కంఠమునఁ బుష్పమాలికవేయుదురు. కరతాళధ్వనులుచేయుదురు.

(అనుబంధము 21.)

(యవనికపడును).

—: ద్వితీయాఙ్కముసమాప్తము. :—



శ్రీ

# పాంచాలీస్వయంవరము.

———:o:———

## తృతీయాంకము—ప్రథమరంగము.

గంగానదీతీర అరణ్యము.

[ప్ర: బహుస్త్రీలతో వినోదములాడుచు అంగారపర్ణుఁడు.]

(అనుబంధము 22, 23.)

(తరువాత ప్ర: పాండవులు, దశరూపుఁడు, అంగారపర్ణుని భటుఁడు వారినడ్డగించును,)

అర్జు—భటాగ్రణీ! ఇదేల మమ్మునడ్డగించెదవు.

భట—గంధర్వరాజుగారగు నంగారపర్ణులు స్త్రీసంఘముతోఁ గ్రీడమొనర్చుచున్నారు. రాఁగూడదిక్కడికి.

అర్జు—ఈక్రీడ యెంతసేపుండును ?

భట—ఇంతప్రసంగము మీకెందుకు? తెల్లవారువఱకు నుండినను నుండినదే.

అర్జు—ఈనదిదాటిపోవుటకు మార్గాంతరములేదే. ఉదయమువఱకు మేమిందేయుండవలయునా ?

భట—కావలసియున్నఁ బడియుండవలయు. లేకున్న వెనుకకుఁబోవవలయు. ఎవరికొఱకు ?

అర్జు—భటసత్తమా! ఈనది యంగారపర్ణుని స్వత్వమా.

భట—అదిగో ఇదియధికప్రసంగము. ఊరకావలఁబొమ్ము. మాటాడకుము.

శ్రీక—అదియే యధికప్రసంగమయిన, దీనికేమందువు? (అని మెడఁబట్టిత్రోయును).

భట—(మూడుమాళ్లు పొరలి క్రిందబడిలేచి) హా! రాజేంద్రా! కాపాడుము. కాపాడుము.

అంగా—(ముందటికివచ్చి) ఎవఁడురాయిక్కడని మాక్రీడకభ్యంతర మొనర్పవచ్చినవాఁడు.

భట—అయ్యా! మీవిధేయసేవకుఁడు.

అంగా—ఓరీ! సంజయా! నీవా ఇట్లేటికిఁబడియున్నావు?

భట—దేవా! కొందఱుబ్రాహ్మణులును నొకవిధవయు వనమునఁబ్రవేశముసరింప నుద్యమింపఁగా మీయాజ్ఞ వారికిఁజెప్పితిని. వారమిక్కిలి యాగ్రహించి యీవనము నదియు మీయంగారపర్ణుని యబ్బగంటా—తాతగంటా యని మాటలాడి, విజృంభించి వారిలోనొకఁ డున్నపోతువంటివాఁడువచ్చి నన్న న్యాయముగఁజంపెను. అయ్యో! అయ్యో!

అంగా—ఎవఁడురా యాబ్రాహ్మణుఁడు. తనబ్రాహ్మణ్యము తన్నుఁగాపాడఁగలదని నమ్మియున్నవాఁడు కాఁబోలు. వానికి బుద్ధిగఱపెద. ఇదెవచ్చెద (లోనికిఁబోయి యుడుపులుధరించివచ్చి) ఓరీ! బ్రాహ్మణహతకులారా! మీకింతకావరమా! నాభటుని చెఁవడురా మోదియున్నవాడు. వాని ప్రాణములపై నంత నిరాశయా? శ్రద్ధపుతిం డ్లఁదిని కండక్రొవ్వుహెచ్చినదా? అంగారపర్ణుఁడన్న నింతతెలియకపోయెనా?

(అనుబంధము 24)

అర్జు—నీవంగారపర్ణుఁడవైతివి. జలపర్ణుఁడవైతివి. అహంకారపుమాటల ప్రేలకుము. మాటల మిగిలిరానిచ్చితివేని నీకన్నులనున్నక్రొవ్వు దిగునసుకొనుము.

అంగా—దురాత్మా! నీవుబ్రాహ్మణుఁడవని నేఁబూజింతునని యెంచితివా? యీపొగరు మాటలకు కొనుమిదియే నీకుశిక్ష (అనిచెంపకువేయఁబోవ).

అర్జు—(తప్పించుకొని) అదిగాదు చూడవలయునది. ఇదిగోయిది (చంపకొట్టెను).

అంగా—దుర్మతీ! అయిన నిలువుము. (అని ధనవుచేబట్టి యుద్ధమునకు ప్రారంభించును).

(ఇరువురు ఘోరయుద్ధమాడెదరు).

అంగా—ఔరా! ఏమాశ్చర్యమిది? బ్రాహ్మణుఁడిట్టి విలుకాఁడుండునని యెఱుఁగ.

తే॥గీ॥ సురలలోశూరులౌమహాసురులలోన।
నురుమహాసురవరులలోనున్నయట్టి।
కడిఁదివిలుకాండ్రపెక్కండ్రఁగాంచినాఁడ।
నిట్టియద్భుతకాండీరునెందుఁగాన॥

వీఁడుసామాన్యుఁడుకాఁడు. యీఇంద్రాస్త్రము పూనివైచెద. (వేయును).

అర్జు—వీఁడింద్రాస్త్రమువైచె. ఈ ఐంద్రబాణము రుచి నింతచూపెద.

అంగా—భళిరే! ఇతఁడు పరశురాముఁడా, లేక ద్రోణుఁడా, లేక రాజఋషియగు భీష్ముఁడా, వయస్సంతలేదే. వీరుతప్ప నిట్టియస్త్రనైపుణి యితరులకుండునా? ఇఁక బ్రహ్మాస్త్రమునే యను సంధింపవలయు.

అర్జు—ఇతఁడసామాన్యాస్త్రలాఘవము గలవాఁడుగానున్నాఁడు. అదిగో! బ్రహ్మాస్త్రమో, యేదో యితరఁ దివ్యాస్త్రముఁ బూనునట్లున్నది. ఇంకఁదడయరాదు. ఈయాగ్నేయాస్త్రమున వానిదహించెద. (వేయును).

అంగా—(మూర్ఛిల్లును).

అర్జు—శ్రీకంఠా! వీనినెత్తుకొనిరమ్ము. మనయన్న శతానందునొద్దకు గొనిపోదము.

శ్రీక—(యెత్తుకొనివచ్చి) అన్నా! ధర్మతనయా ఆఁ—శతానందా! నీకీయంగారపర్ణుఁడొక కానుకగానుండ నీతమ్ముఁడర్పించుచున్నాఁడు.

అంగా—(స్వ) ఆహా! ఏమిది! "ధర్మతనయా" యనియె. అట్లయినఁ నతఁడర్జునుఁడుగానే యుండవలయు. అయిన లక్కయింటవారు దహింపఁబడరో? ఎంతసుదినము నేడు!

శతా—అంగారపర్ణా! బ్రాహ్మణులను నీవవమానోక్తులాడఁజనునా? అయ్యా! దైవము సృజించి యందఱకును స్వత్వముగానిచ్చిన నదిని బ్రాహ్మణులఁ బ్రవేశపెట్టనీయక నీవుతప్పొనర్చితివి.

అంగా—రాజేంద్రా! మీరు బ్రాహ్మణులరని యేలదాఁచెదరు. నీతమ్ముఁడు భీమసేనుఁడు "ధర్మతనయా"! అని నినుసంబోధనమొనర్చి యింతలోనసే త్రిప్పుకొనియె. మీ వృత్తాంతమంతయు విదితమయ్యె. మీయశము మాగంధర్వలోకమునను నిండియున్నది. అట్టిమీరు లాక్షాగృహమున హతులైతిరని వినుటకు నపారదుఃఖము మాకెల్లఁగలిగియుండె. మీయట్టివారి కట్టిదుర్మరణము కలుగనేరదని మము బోంట్లందఱు ననుకొంటిమి. అదియేనిక్కమయ్యె. ఇప్పుడు నను నిర్జించినవాఁడర్జునుఁడగుట తెలుగనయ్యె. సమానుఁడగు వానితో యుద్ధములభించినందుకు సంతసించితి. జితుఁడనైతినని యించుకయుఁ జింతింపను.

సీ॥ సరిగాననున్న నాశక్తి నీయనుజుండుమాయుంచుటకుఁ

జింతసేయనయ్య!

యదివిలాకుఁడైన యర్జునుతోఁబోరు టెనాకుఁగీర్తి

యుంచెంతునయ్య!

కనుగానకున్న నాగర్వంబుమాన్పుటహితమంచుమదిని
నూహింతునయ్య।
తారతమ్యముమాని తలరిన నాకిట్టిశిక్షమేలంచు
యోచింతునయ్య।

తే॥గీ॥ చెలఁగినానామమింకఁద్యజింతునయ్య।
యెంచి చిత్రరథాఖ్య వహింతునయ్య।
యోపిసౌశీల్యమే మదినుంతునయ్య।
మీకు మిత్రుఁడనై యింకమింతునయ్య॥

దేవా! నన్నీయర్జునుఁడు నిర్జించెనని యించుకయుఁ జింతింపనని మున్నేయంటిఁగదా? కామినీజనమునఁ గ్రీడించుచున్నందునఁ బ్రమత్తతతో మీయట్టివారి నన్నిమాటలాడి నందున నాకాశిక్షతగినదే. అట్లాడి మఱియు నదే యంగారపర్ణ నామంబుధరించియే జరించనోప. ఆగ్నేయబాణమున దగ్ధుడనైయున్నందునఁ జిత్రరథనామంబింక గ్రహించి నెగడెద. అర్జునా! నీవునాకు సఖుడుగానుండవలయు.
దేవా! అనతిమ్ము పోయివచ్చెద. (నిష్క్ర)

శతా—శ్రీకంఠా! ఎప్పటికైనను నీవలననే గుట్టుబయలుపడుట. ధర్మతనయాయని బిలిచి యంగారపర్ణుఁ డెఱుఁగునట్లు నర్చితివి.

శ్రీక—ఏమో! సంతోషమున జ్ఞాపకముమఱచితి. ఇందునకేమివచ్చెను.

దశ—దేవా! ఇంకేలగుట్టు. సుయోధనునకు యువరాజ్యమగువఱకే కదా మీరు గూఢభంగి నుండనెంచినది. ఇప్పుడింకేమి సంశయము. వానికి యౌవ్వరాజ్యమువచ్చి దాదాపున రెండుమాసములు కావచ్చె.

శతా—దశరూపా! కానిమ్మోమియవసరము. ఈదివ్యదేశము లెన్నఁడు చూడవలయు. ఆహిమవద్గిరి దర్శించి దివ్యక్షేత్రములఁబూజించినంతనే యీబ్రాహ్మణవేషముల మానుదుము.

దశ—మరినేనిట్లే యిప్పుడేపోయి మీవృత్తాంతమును, మీరుయుద్ధమునకు రానున్నవృత్తాంతమును హస్తిపురిలోఁబ్రకటించి యల్లకల్లోలము చేయుదునా?

శతా—వలదు. దివ్యదేశయాత్ర ముగియనిమ్ము, తర్వాతఁ జూచుకొందము. నీవును మావెంట రమ్ము.

దశ—భాగ్యము. (అందరు నిష్క్ర).

—:0:—

# తృతీయాఙ్కము-ద్వితీయరంగము.

—:O:—

## పాంచాలపురివీథి కుమ్మరియిల్లు.

[కుమ్మరి యిద్దరుభార్యలు పారెత్రిప్పుచుందురు.]

1వ భార్య—సూడి సూడి సారెసక్కగదిరగలేదు. సక్కబెట్టు.

2వ భార్య—నీవుసరిగ్గా తిప్తేగదా. సొట్టి సొట్టి తిప్తే సరిగ్గా యెట్లుతిరిగేసీ.

1వ భార్య—వోశెబడవా. మన్నిక్కడెయ్యి. తగ్గిపాయ. మాటలుమాత్రం ఆడుతావు.

2వ భార్య—వోముండా! నీవెవరే నన్నునేకి. నేనేయను. నువ్వేసేసుకో. (అని కోపముతో దూరమునుండును).

### ప్ర: గు ం డ ప్ప.

గుండప్ప—(స్వ) యోహో యిద్దరు కొట్లాడినట్లుందాది. ఇద్దరుకలిసి నాపని పాడుసేస్తిరి. యెవరు సెయ్యాలె? మీ అబ్బ

2వ భార్య—వయ్యా! సూడె. ఇదినాకుపనిసెప్తాది. తాను సేయలేక.

1వ భార్య—ఇదిసూడు. పనిసేయక కూకోని పనిపాడుసేసింది. నువ్వుయేమి అనవు. దీనికి దిమాకు.

2వ భార్య—యింకోసారిఅంటె సెప్పెత్తికొడ్తా.

1వ భార్య—ఓయమ్మల్లాల యంతదిమాకురా దీనికి. మొగుడొచ్చాలకి మిడిసిపడ్తాది. సూతాము యవరడ్డమువస్తారో (అని పొరకతో గొట్టును).

2వ భార్య—ఓనాసయితీ. నీకెంతపొగరే. వయ్యా! సూడే దీన్ని సావమొత్తు.

(గుండప్ప ఏమియుననలేక దిక్కులు చూచుచుండును).

నాబట్టా! నీవుదిమాకు నామీద పీతి—పీతియనేది ఇదేనా? సూడినాయేటు (అని 1వ భార్యను పొరక చేటలతో పలుమారు కొట్టుచుండును).

గుండప్ప—తాలరె-తాలరె-సాలునులె-సాలునులె (అని విడపింపబోవ, వారిద్దరు వానిని మొత్తుదురు).

1వ భార్య—యేమి సాల్లేఅంటె. నాయం తీర్చమంటె శాతగాక సచ్చిందాడు. మేమ్మే సరిసేసుకొంటాముపో (అని యిరువురును మన్ననలుఆడిగికొని సమాధానమగుదురు).

గుండప్ప—వవ్వా! (అనినవ్వి) ఇదిమంచితమాస. ఇంతతాపాసానికే వస్తాది.

(అనుబంధము 25)

గుండప్ప—పోయిందిపోన్లే. ఏమె! మనవూర్లో రాజుబిడ్డ కిట్టన్న సాయమ్మరము సాగిండాది. యెక్కడముంటో రాజులు, గొప్పోళ్లు వచ్చిండారు. దిగేకి సోటులేనేలేదు.

యిద్దరు—వయ్యా! మనముపోదామే సాగ్సుసేసుకొని. మాకుసీరలు సొమ్ములుయీవె.

కొమారుడు—నాయన్నా! నేవస్తానే; నాకుమోటారుబండి యిప్పించె.

గుండప్ప—యివన్ని యాడత్యావలె. కాసులె. బువ్వకులె.

(అబంధము 26.)

[ప్ర: పాండవులు, గుంతి, దశరూపుడు]

దశ—(స్వ) ఈపురిలో గృష్ణాస్వయంవరమఁట. ఎక్కడెక్కడిరాజులు వచ్చినిండి యున్నారు. కూర్చుండుటకైనఁజోటుచిక్కదు. అదే కుమ్మరియింటమాత్ర మున్నట్టు న్నది. పోవుదము (పోయి).

శతా—అయ్యా! మాకింత చోటునిత్తువా?

కుమ్మ—అయ్యో! యాడుందయ్యాసోటు? మహామహావాళ్లే అల్లాడిపోయినారు. అదిగాక మేముకుమ్మరోళ్లము. మీరు బ్యాన్మలు. ఈలోగా బ్యామ్మలు వక్కరితో నూ కలరే.

శతా—అయ్యా! నిజమే. బ్రాహ్మణులు కొంచ మితరవర్ణములవారి నీలోపల దూరపు చూపు చూడనుఁ బ్రారంభించినారని వింటిమి. అదియెక్కడనో యేరాజ్యముననో. అట్లుచేయుట దేశమునకే యక్షేమము. మేమట్టివారముకాము. ఇంత వండుకొనను బండుకొనను జోటుమాత్రమిచ్చిన నొకనాఁడుండి పోయెదము.

కుమ్మ—వసే! ఈ బాపినోల్లకు సోటిత్తాము. ఆదొడ్లో సిద్దంసేసీవే?

భార్య—యాడుండాది దొడ్లోసోటు. జంగమయ్య యీసందెకొచ్చెల్యా. వాల్లక్యాడ సోటునూపాలె.

కుమ్మ—వున్నంతలోనే సూసుకొందాము. పో అక్కడుండే కుండలు తీపో.

భార్య—నువ్వేపో, నేనుయిక్కడ సూసుకుంటా.

కుమ్మ—సూస్తివే. నీకు దిమాము తన్నులుపడుతావుండాలె. పోతావా లేదా?

భార్య—(గొణుగుకొనుచు లోపలికిబోవును).

(పాండవులు లోపలఁబ్రవేశించి కూరుచుందురు).

కుమ్మ—ఎక్కణ్ణించి వచ్చిండారయ్యా మీరు ?

శతా—అయ్యా ! మాది బహుదూరదేశము. పర్వతానకు బోవుచున్నాము. అయ్యా ! నీపేరేమి ?

కుమ్మ—అయ్యా ! నా పేరు గుండప్ప (నమస్కరించును).

శతా—గుండప్పా ! యీయూరిలో నింతసమ్మర్దమున్న దే. ఏమివిశేషము ?

గుండప్ప—అయ్యా ! మారాజోల్లపిల్ల కిట్టమ్మకు సాయమ్మరం సాగింది. ఎక్కడెక్కడో ముంటోజనాలు వచ్చిండారు. అయ్యయ్యో రాజోళ్ళంటా, యెయ్యింటికి వచ్చిండారు, యెక్కడసోటులేకుండావుంది.

శ్రీక—ఏయేరాజులు వచ్చియున్నారు. నీవేమయిన నెఱుఁగుదువా ?

గుండప్ప—అయ్యో ! అయ్యో ! ఆబడ్డీకొడుకుల పేళ్ళు యెవరికి తెల్సు.

శ్రీక—హస్తినావతినుండి దుర్యోధనుఁడు మొదలైనవారు వచ్చియున్నారా ?

గుండప్ప—ఎవరోనయ్యా—వకరనిచెప్పేదా, ఎందరోవచ్చిండారు. వకవూరుముంటి నూరుమంది వచ్చిండారంట మరియొకవూరిముంటి నలబైమంది వచ్చిండారట. అయ్యా ! నాకుపొద్దౌతాది నేనుపోతాను, కొంచము వుశారుగామాత్రం వుండండి, మీకు యిల్లు పట్టేకి తెలుసునా ?

శ్రీక—ఏమీ ! యిల్లుకట్టుటకా ?

గుండప్ప—కాదయ్యా యిల్లు. యిల్లు పట్టేది ?

శ్రీక—యిల్లెట్లుపట్టవలయు ?

ఉపేంద్ర—గుండప్పా నీవనుట విల్లా—ధనువు ? (సౌంజ్ఞ్యచేయును).

గుండప్ప—అదే. అదే.

ఉపేంద్ర—ఏలడిగెదవు ?

గుండప్ప—మతియేణ్ణుంటో వశ్శిండేరాజు కయ్యాన్కి తయారై వశ్శిండాడంట, కిట్టమ్మ తన్ను శేసోకుంటే లడాయికే వుంకించి వూరంతా దోసుకోపోతాడంట. మాతలారి పెద్ద సాటించిండాడు. వూరంతా యిల్లు అమ్ములు సిద్ధంగావుండాయి కావల్సినోల్లకంతా రాజోడే యిండ్లు యిస్తాడు. మాయింటికి నాలుగైదు వచ్చిండావి.

ఉపేంద్ర—ఉండనిమ్ము. అంతకువచ్చినప్పుడు మాకును విండ్లిత్తువఁటలెమ్ము.

(లోపల వయ్యాయని ధ్వని).

గుండప్ప—ఇదిగో వస్తావే. అయ్యా పొయ్యేశొస్తా. బద్రంగావుండండి.

(నిష్క్రమి).

శతా—మిక్కిలి సంరంభమున్నట్లున్నది. ఎవరుందు రాయుద్ధకాంక్షులు ?

శ్రీక—మనదాయాదిరండాపుత్రులే యుండవలయు? ఇంకెవరు? అన్నా! మనమును నేఁడు స్వయంవరగృహమునకుఁబోవుదము. ద్రుపదపుత్రి యెవరిని వరించునోచూతము. యుద్ధము తటస్థించెనా మనమును యుద్ధమాడి యాకన్నియఁగ్రహించి నీకువివాహ మొనర్చెదము.

శతా—కుమారా! నాకువివాహ మొకటియే యిప్పుడుకొదువ.

శ్రీక—అదేల కారాదు?

శతా—తమ్ముఁడా! నీవౌచిత్య మెఱుఁగక మాటలాడెదవే. ఇపుడు మనమున్న స్థితిలో రాజ్యమా? ఇల్లా? వాకిలియా? భార్యనుగట్టుకొని యెందుండవలయు?

శ్రీక—ఏల? ద్రుపదునికేమి దారిద్ర్యమా? కొన్నాళ్లు వానియింటనేయుంటిమి.

శతా—స్త్రీపిత్రోపజీవులఁగమ్మంటివా? ఆమాటనుకుము. మనముద్దేశించినయాత్ర జరిపి హాస్తిపురికేఁబోయి మనకురాఁదగిన స్వత్వము పుచ్చుకొని పిదప వివాహయోచన చేయుదము.

శ్రీక—(గొణుగును)

శతా—తమ్ములారా! మనమెల్లరము నలసియుండుటచేఁ దొలుత నేరెండుదినములిండే యుండవలయునని యెంచియుంటివి. ఇపుడో ఎవరో యధర్మభంగి నూరెల్ల గజబిజి యొనర్పనున్నారని వినినందున మనమును దగినసాహాయ్య మొనర్పవలయునని యిప్పుడే యుద్దేశించి స్వయంవరమహోత్సవము నెఱవేఱువఱకు నిండేయుండఁ దలంపుగంటి. అయిన నొక్కమాట మీరు నాకొసంగవలయు. మీరెవ్వరుగాని నన్నడుగక స్వయంవర గృహమునకుఁబోరాదు. ఇందుకొప్పితిరా యిందుందము. కాకున్న నేఁడేభోజనము పిదప వెడలి పోవుదము.

ఉపేంద్ర—అన్నా! నీయిచ్ఛకు వ్యతిరేకమున్నదా? అవశ్యమట్లే పోకయుండెదము.

శతా—శ్రీకంఠా! నీవును వచమీవలయు.

శ్రీక—ఒకవేళ స్వయంవరగృహములోనే కలహముజరిగిన మనమేల పోరాదు?

శతా—అపుడందఱమును బోవుదముగదా.

శ్రీక—అదిజఱుగునా లేదా తెలుసునొనుటకై యందేపోయియుండి వినోదములైన నేల చూడరాదు?

శతా—అనుజా! అక్కడికి దుర్యోధనాదులు వచ్చియుందురనుట నిక్కము మనముపోయిన వారివలన గుఱుతింపఁబడుదుమనుట యింతకంటెనిక్కము. వారినిఁజూచినంతనే మనకుఁ గ్రోధము పెఱుఁగుననుట మఱింతనిక్కము. అప్పుడు నిక్కముగా స్వయంవరగృహము కదనరంగము కాఁగలదు. అటులౌట మనముందుకార్యములకు విఘాతము.

సీ॥ అచ్చోటికి సుయోధనాదులు తప్పక చనుదెంచురనుట
నిశ్చయముగాదె।
మనమందుఁబోయిన మమువారు గుఱుతించు సరణి మఱింత
నిశ్చయముగాదె।
మఱి వారిగన్నంత మనకుఁగోపము గల్గుచందమింకింత
నిశ్చయముగాదె।
వారు మనము చూడ ఘోరయుద్ధమవుట భయమంతకంటె
నిశ్చయముగాదె।
తే॥గీ॥ అప్పుడేమానోతలఁపరేయ సమయమున।
ఘనస్వయంవరగృహమెల్లఁగదనరంగ।
మాచునల్లోలకల్లోలమగును గాదె।
యదిహింతబోనెతలపోయుఁడనుజులార॥

శ్రీక—ముఖ్యము దుర్యోధను నాయువు దొడ్డది. వానికి బ్రహ్మయిచ్చిన యాయువు గాదు. నీవిచ్చినది. అయినను గానిమ్ము. నీయిష్టము.

ఉపే— (అనుబంధము 26)

శ్రీక—(కోపమున నిష్క్రమి).
శతా—వీఁడింతైనఁదెలిసినవాఁడు కాఁడు. వీనిఁగాపాడుకొనుట ప్రయాసముగానున్నది.
ఉపే—ఏమిచేయవచ్చునన్నా! అంతదౌరాత్మ్య మొనర్చినవారి శిక్షింపకూరకుండ వలయు నన్న మనస్సు తిరుగఁబడుచున్నది.

సీ॥ గరమున జలమున నురగంబులను జంప నుంకించుటకు
నోర్చియుండలేదె।
యుండినవాడుమ మ్ముడికింప నాకర్ణునంగరాజుగఁజేసి పొంగలేదె।

పోంగనిమ్మనియోర్చి పోవనిచ్చిన మమ్ముఁబోరిఁబోరి
హింసింపఁబూన లేదె।
పూనుటకాక యాపురిమముఁగాల్పఁబేర్చినలక్క—
యిల్లునిర్మింప లేదె।

తే॥గీ॥ అగ్రజా యానృశంసు నేమనఁగవచ్చు।
నూరకేవానిదుష్కృతికోర్చియోర్చి।
వేసరితిమిల్లైయే వేళగాసికోర్చి।
యుండవలెనన్న మనసెట్టులొప్పఁజెపుమ॥

శతా—నిక్కమయ్యా! దేశకాలములు విచారింపవలదా? ఒక్కరినొక్కరు శిక్షించువారా దైవము శిక్షింపవలయుఁగాక. (యవనికపడును).

—: తృతీయాఙ్కము సమాప్తము :—

శ్రీ

# పాంచాలీ స్వయంవరము.

—: o :—

## చతుర్థాఙ్కము-ప్రథమరంగము.

(ద్రుపదు నంతఃపురము)

[ప్ర: ద్రుపదుఁడు, మంత్రి, సేవకుఁడు, గుడ్డలమూటలతో]

ద్రుప—మంత్రీ! ఇది యేమాశ్చర్యము? ఈపనికిరాని గుడ్డలుకాక యీయూరఁగాని యీ దేశమునఁగాని బహుమానార్హమయినగుడ్డలే లేవఁట. మాకోకిల వీనిఁజూచి యసహ్యించుకొనియె.

మంత్రి—దేవా! ఏమని చెప్పవచ్చును. చీనాయన పారశీక దేశములనుండి వచ్చుచున్న గుడ్డలు మనదేశపువారగ్గువయని కొనసాగిరి. మనదేశముననున్న తంతువాయులు పనుల మానుకొనిరి.

ద్రుప—అయిన దీనికేమి చేయవచ్చును ?

మంత్రి—నే నానాఁడే మీతోఁజెప్పితినే, పరదేశవస్త్రములకు సుంకము వేయుట మేలని మీరది నాగరికలక్షణము కాదంటిరి.

ద్రుప—నిక్కమే! సుంకము వేయకున్న మానె మనదేశపువారు వానిఁగొనకున్నఁజాలదా.

మంత్రి—అదియుంజెప్పితిని. మనదేశమువారి నితరదేశ వస్త్రములఁగొనకుండ నిర్బంధపెట్టవలయునని అందునకు "మనకేమియక్కర? జనులయిష్టము. ఏదియగ్గువగానున్న దానిం బేసికొందురని" యుపేక్షించితిరి.

ద్రుప—అదియు జ్ఞాపకమునకువచ్చె. ఈవిషయమై ముందు యోచింతము. స్వయంవరకాలమున కొదువకున్నమానె పది యాఱవనాగవలికైన మంచియుడుగరలీవచ్చు. విజ్ఞులను జక్కనిపనివాండ్రను నయిన కువిందులను బిలిపించి యమూల్యములయిన పట్టు సరిగవస్త్రముల నొకయిరువదివేలు సేయింపనాజ్ఞయిడుము.

మంత్రి—దేవా! కువిందకులు మాత్రావశిష్టులై యున్నారు. జ్ఞానాధికులెక్కడనున్నారు? పనివాండ్రెక్కడనున్నారు? వారిపనిముట్లెక్కడనున్నవి?

ద్రుప—అదేల?

మంత్రి—ఏమని చెప్పుదును? అగ్గువబట్టలెల్లెడలఁ బ్రబలి వారిగట్టివస్త్రముల నడుగువారే లేనందున నానాఁటికి వారు క్షీణగతిఁజెంది మగ్గములుగట్టిపెట్టి, కొందఱు కృషీవలులైరి. మఱికొందఱది యవమానకరమని దేశాంతరములకుఁబోయి కార్యాంతరప్రవిష్టులైరి. ఇంకఁగొందఱు భైక్ష్యవృత్తితో జీవించుచున్నారు.

ద్రుప—ఆహా! ఇంతేనని తెలియనైతి.

(అనుబంధము 27.)

పోనిమ్ము ఉన్నవారినే పిలిపించి వారివారి మగ్గములఁ బనులుచేయుట, కేర్పాటులు చేసియయినఁబదార్థములనెల్ల మనమే కొనునట్లొనర్పుము.

మంత్రి—రాజేంద్రా! అట్లయిన నందఱికిని మగ్గములుసయితము మనమే యిప్పించవలయును.

ద్రుప—వారికున్న మగ్గము లేమాయె?

మంత్రి—కొన్ని యెలుకలు, కొక్కులుకొట్టి పాడాయెను. కొన్ని వానకాలమున నన్నముపోయి క్రిందికాయె. మఱికొన్ని పిల్లవాండ్ర గుజ్జుమాటలకుఁజిక్కి పాడయ్యె. ఇంకఁగొన్ని—

ద్రుప—చాలింపుమింక వినఁజాల. మనయశ్రద్ధయే యీయనర్థములకు మూలము.

మ॥ పలుమార్గంబులఁ బాశ్చాత్యపౌరజనముల్వాంఛించు సద్వస్తువుల్ ।
బలునాణెంబుగఁ జేసి యర్థతతి సంపాదించి జీవించుచుʼన్ ।
గులవృత్తుల్ దలఁగింప కెల్లపనులందుంజాణులై యున్నవా ।
రలకుం గూడుఘటింపదన్న మతియీరాజ్యంబుతప్పేగదా ॥

ఇందుకుఁబ్రతిక్రియ యొనర్పనేవలయు. ఉన్నట్టుండి విదేశవస్తువులకు సుంకమంటిమేని యిక్కట్టులకుఁ గారణమగు. ప్రకృతము మనదేశమువారినిమాత్రము నేనాజ్ఞయిడి యున్నానని ప్రకటింపుము. ఏమన్న మనదేశములో నుత్పత్తికాఁగల వస్తువు లెంతప్రియ మనియెంచినను నట్టివస్తువుల నన్యదేశమునుండి యెంతగ్గువగాఁజిక్కినను మనవారందఱు మనదేశపువస్తువులనే కొనవలయు. పనివాండ్రకుఁ గావలసిన సాధనసంపదకు వలయు ద్రవ్యము మనబొక్కసమునుండి యిప్పింపుము. కొనువారొదవువఱకునయిన వస్తువులు మనమేకొని సేకరించి పిదప విక్రయించునట్లొర్పుము. (నిష్క్ర).

—:0:—

## ద్వితీయరంగము_కుమ్మరియిల్లు.

—0—

[ప్ర: కుంతియు (భవాని) శతానందుఁడు, ఉపేంద్రుఁడు, కృశానుఁడు, చిత్రభానుఁడు].

ఉపే—అన్నా! అక్కడికిఁబోయి యుండఁడు నేనుబోవనని నీకుమాటయీఁడా?

శతా—పోవఁడనియే నాకునుదోఁచుచున్నది. అయిన మిక్కిలి యసమాధానముగా మాట లాడె నీకుజ్ఞాపకములేదా? "నీయిష్టమని" యింతనేఁగాక నేనుబోవనని స్పష్టముగాఁజెప్పఁడయ్యె. తెలియుఁగదా?

[ప్ర: దశరూపుఁడు.]

దశ—దేవా! ఆసమ్మర్దమునఁబోవుటకు సాధ్యములేదు. వచ్చువారు, పోవువారు, సంఖ్యాతీతులు, నాకుఁజొఱవయబ్బుటయే ప్రయాసమయ్యె. అక్కడనెంతెంతో చూచితి.

శ్రీకంఠయ్య కానరాఁడయ్యె. అయిన నాదూరమునఁ గొందఱు బ్రాహ్మణుల సమూహముగంటిని. అందులో నతనింబోలినవాఁ డొక్కఁడున్నట్లుండె. అతఁడేయనఁజాల సమీపమునకుఁబోవుట యసాధ్యమయ్యె.

శతా—ఉపేంద్రా! ఇదిసమయముగాదు. శ్రీకంఠుఁడు డాస్వయంవరమునకే పోయి యుండవలయునని తోఁచుచున్నది. వానినొంటినిడిచిన నల్లకల్లోలమగును. నీవీ దశరూపునితోఁబొమ్ము; మేమునొక్కింతనిలిచి యాభవనమున కెదురుగానున్న మంటపము నొద్దకువచ్చెదము. కలఁతలేమియులేక స్వయంవరము జరిగెనా మంచిదయ్యె. కలహమేమయిన జరుగునట్లున్న నీవు వానికి సాహాయ్యముగానిలిచి యీదశరూపుఁడీల వేయువాడు. మేమును వెంటనేరాఁగలము.

ఉపే—భాగ్యము. (అని దశరూపునితో ముందు రెండడుగులుపోయి వెనుకకువచ్చి) అమ్మా! నాకేమో శుభశకునములగుచున్నవి. ఇట్టిశకునములు మాయన్నకు యౌవ్వరాజ్య మబ్బిన నాఁడు నాకయియుండె. ఏదోగొప్ప ఫలములభింపవచ్చునని తోఁచుచున్నది.

తే॥గీ॥ అంబ నాకునుశుభశకునంబులయ్యెఁ।
దనరెమదినెందులేని యుత్సాహగరిమ।
యవనిజనులెల్లఁబొగడు మహాఫలంబు।
గలుగనున్నది నేఁడు నికమ్మునుమ్మ॥

భవాని—(ఉపేంద్రుఁగౌఁగిలించి) కుమారా! మిక్కిలిసంతోషము. ఎట్టిఫలములభించినను మీరేవునుపభోగింపవలయు. ఇదినిక్కమేకదా?

ఉపే—అమ్మా! ఏలయిట్లడిగెదవు? మాయేవురిలో భేదమున్నదా? ఒకనిశుభమందఱి శుభమునగుఁగదా? నీయానతిజవదాటువారమా?

(అనుబంధము 28.)

భవాని—కుమారా! అందునకుఁగాదు. నీకుసత్ఫలము గలుగవలయునన్న నాకొకటి తోఁచుచున్నది. దుష్టరాజులెవ్వరో ద్రుపదుతో నేఁడు కలహించునట్లున్నది. ధర్మమునకై నీవు తోడ్పాటుచేయుదువు. వానికి జయములభించిన నీకత్యంతబహుమానము కలుగు. అప్పుడు నీబహుమాన మందఱునొందుటకు సాధ్యములేదుగదా? మొన్న నరణ్యమున మీరందఱు మిక్కిలి యాఁకలిఁగొనియున్న వేళ కృశానుఁడొక పండుతెచ్చి తానె తినఁదొడఁగినది వింటివికదా? మీకందఱికి నియ్యక యెంతాఁకలియున్నను,

దా భుజించినది యకృత్యము. అందుకు నేను దండించినదియు దానిపై వాఁడు "నాకుఁ జిక్కినది" యనియు నాకాఁకలి మెండుగానుండెననియుఁ దొల్త నాడి పిదప క్షమాపణము చెప్పుకొన్నదియు నెఱిఁగితివికదా? ఈకారణముగనీమాటంటిని.

ఉపే—ఏమో చిన్నవాఁడు. వినోదమున కట్లాడెఁగాక మాకుభేద బుద్ధిగలదా? మాలో నెవరికేఫలము లభించినను నేవురు ననుభవించువారమె.

ఆ॥వె॥ ఇంతమాత్రమునకె చింతిల్లవలయునె।
భువినిమాకుభేదబుద్ధిగలదె।
యలకృశానుఁడప్పుడాఁకలిగొన్నాఁడు।
పిన్నవాఁడు తెలయకన్నవాఁడు॥

అన్నా! పోయివత్తును. (నిష్క్ర).

శతా—అమ్మా! ఈ యుపేంద్రుఁబోలినవాఁ డెందుఁగలఁడు. ఎంతమాతృభ్రాతృభక్తి.

[ప్ర: శ్రీకంఠుఁడు (త్రేన్చుచు)]

శ్రీకంఠా! ఎక్కడికిఁబోయియుంటివి?

శ్రీక—ఏమన్నా! ఇంతాతురుఁడవై యడిగితివి?

శతా—ఏమియులేదూరకయే. ఇంతసేపులేకున్నఁ గొంత చింతగలిగియుండె.

శ్రీక—నిన్న సాయంతనమున మాటలాడుచుంటిఁగదా యొకబ్రాహ్మణునితో? అతనికొఱకుఁ బోయియుంటిని. ఇట్లే మాటలాడుచుండి యాబ్రాహ్మణుఁడు సమారాధనచోటికి భుజింపనుబోవుచు నన్నుందోడ్కొనిపోయె. ఇంటనాకంత తృప్తి వొడమియుండమిచేఁ దృప్తికరముగ భుజించివచ్చితి. వెయ్యిబ్రాహ్మణ్యమునకుఁ జేసియుండగా నేనొక్కరే వచ్చియున్నారే యను వారిచింత దీర్చివచ్చితి. ఉపేంద్రుఁడేఁడీ?

శతా—నీకొఱకే వెదకఁబంపితి. మనము నట్లుపట్టణమునఁ దిరిగి వత్తమురమ్ము.

శ్రీక—స్వయంవర గృహమునకుఁబోవుదమా?

శతా—అంతవఱకుంబోదమురమ్ము. అమ్మా! మేముపోయివత్తుము. (నిష్క్ర).

—: చతుర్థాఙ్కము సమాప్తము :—

శ్రీ

# పాంచాలీస్వయంవరము.

———:0:———

## పంచమాంక్యము ప్రథమరంగము.

——0——

(స్వయంవరగృహము.)

ద్రుపదుఁడు, మంత్రి, శిఖండి, దుష్టద్యుమ్నులొకచోట. దుర్యోధన, దుశ్శాసన, దుర్ముఖ, కర్ణశకునులొకచోట. కృష్ణబలరాములొక్కచోట. శిశుపాల, జరాసంధు లొక్కచోట. మిగిలినరాజు లొకచోట. బ్రాహ్మణసమూహమును వారిలో నుపేంద్రుఁడాసీనుఁడై యొక చోటను. దశరూపుఁడు (ప్రక్కన) నుండు (బ్రాహ్మణు లొకరితో నొక్కరు విచారములును సరసములును నాడుచుందురు). ఒకచోట యంత్రమీనము తిరుగుచుండును. ప్రక్కన గొప్పధనువు విజ్యముగా నుండును—కృష్ణ దాసితో—దూరమున.

పురోహితుఁడు—రాజేంద్రా! రాజలోకమంతయు వచ్చినట్టయియ్యె. ఇంకెవరైన రాజులు వచ్చువారున్నారా?

ద్రుప—బ్రాహ్మణోత్తమా! మఱియెవ్వరైన రాకుమారులు రావలయునేమో యించుక విచారింపుము. పట్టికఁజూచిచెప్పుము.

పురో—(పట్టికఁజూచి) యాదవులు. చైద్యులు. మాగధులు. సౌరాష్ట్రికులు. కౌరవులు. ధార్తరాష్ట్రులు. సౌబలులు. అందఱువచ్చియున్నారు. ఈపట్టికప్రకార మొక్కశల్యరాజు మాత్రము రావలసియున్నది. అదిగోవచ్చె. (శల్యుఁడు ప్రవేశించి కూర్చుండును). అందఱు వచ్చియున్నారు.

ద్రుప—(ముందటికివచ్చి) ఇక్కడఁజేరియున్న రాజలోకమునకెల్ల నావిజ్ఞాపనము. నా కూఁతురు కృష్ణను నేస్వయంవరము చాటించియున్నాఁడను. ఆకన్య తానై వరించి

యీరాకుమారుఁగోరునో యాతఁడు పతిగావలయుఁగదా? ఇదివిధానము. అయిన నాపుత్రి యధికధనుర్విద్యాకౌశలముగలవానిఁ గాక వరింపనని పట్టువట్టియున్నది. ధానుష్కుల కెల్లఁ దమసామర్థ్యము పరీక్షించుటకుఁదతి యొదవినది. ఇదే యీగొప్పధనువు. దీనియల్లె త్రాఁడెక్కించి యీపైనాడుచున్న యంత్రమీన మీనీట నగపడుచున్నది. ఈనీటిం జూచుచు లక్ష్యముంచి యేనుబాణముల నామత్స్యముం దెగవేయవలయు. ఇట్టి ధనుః కౌశలముగలవాఁడు నాతనూజకుం బతికాఁగలఁడు. శూరులెల్ల సన్నద్ధులై యీకార్యమున కుద్యోగింపుఁడు.

సీ॥ చరయంత్రమున నిరంతరముగాఁదిరుగాడిమెఱయు
చున్నదిమింటమీన మొకటి।
జలపాత్రభూమిపై నెలకొల్పఁబడె దానిప్రతిబింబ
మునుగాంచువితము దెలుపఁ।
గడుశక్తిగలిగినఁగాక యెత్తఁగరానిసరణినుం
డెడునిదెచాప మొకటి।
మఱిదానిప్రక్కన మెఱుఁగారియలరెడువాఁడి
మీఱినబాణపంచకంబు॥

తే॥గీ॥ ఆధనువుపట్టిబాణంబులైదువఱపి।
నీటిగుఱిచూచిమీనంబుమీటనేర్చు।
నతఁడెపో పతినాముద్దుసుతకు లెంకు।
శూరవరులార రాజకుమారులార॥

1వ రాజు—(మఱియొకనితో రోచించి) రాజేంద్రులారా! ఇదియేమిసమయము! ఇట్టి పందెముగల స్వయంవరమెందైన వింటిమే? చక్కని విలువిద్యకాని భుజబలమో యింకేబలమో కలవానిఁగాని యీరాజకూఁతురు వరింపనన్నపట్ల స్వయంవరప్రకటనమునం దామాటేలవ్రాయలేదు? అప్పటికి దుంపకట్టైతెవరుండిరో వారేవచ్చుచుండిరి.

అందఱురాజులకు నాహ్వానమేల యియ్యవలయు? ఊరకే స్వయంవరము జరుగుచున్నదని చెప్పిపంపి యిప్పుడిట్టి ప్రతిజ్ఞగలదని చెప్పుటపాడియగునా?

2వ రాజు—ఇదియెన్నటికిని జక్కనిమార్గముకాదు. ఇప్పుడుచూడుఁడు. నామిత్రుఁడు తేజోత్తముఁడున్నాఁడు. బలశాలికాఁడు. మన్మథునిఁబోలు రూపముగలవాఁడు. ఏ రాకన్నియగాని మోహింపఁదగువాఁడు. ఈప్రతిజ్ఞవలన నట్టివాని దూరీకరించునట్లాయెఁ గదా? మొదటినుండియిదె యుద్దేశమున్నఁ బత్రికలలో నట్లువ్రాసియుండవలయు. అతఁ డింటిలోనే నిలుచుచుండెను.

3వ రాజు—అదియంతయునుండనిండు. ఈరాజు ప్రతిజ్ఞ పట్టియున్నాఁడుగదా? ఇందున్న రాజులలో నొక్కఁడుగాని యీయంత్రమీనము గెడపఁజాలకున్న నప్పుడేమి చేయువాఁడు? లేదాపదుగురట్టి విలుకాండ్రు వెలువడి గెడపినప్పు డేమి చేయఁగలవాఁడు? మొదటివిధానమయిన బిడ్డనాజన్మకన్యఁగాఁ బెంచువాఁడా? రెండవవిధానమైనఁ బదుగురికి నింతింతగాఁ గన్యనిచ్చువాఁడా?

ద్రుప—ఈమాటలకు నేఁ బ్రత్యుత్తరము చెప్పకున్న విధిలేదు. ఇందుఁజేరియున్న వారిలో నెవ్వరుగాని యీమత్స్యయంత్రము తెగవేయఁజాలరేని పదిమారులయినను ముందు స్వయంవరము చాటించి ప్రతిజ్ఞప్రకారము గావించువాఁడ. ఎప్పటికిని నట్టివిలుకాఁడు కలుగకున్న నామరణము కన్నియగానే యుండఁగలదు నాపుత్రి. అందుకేమి సంకోచము? ఇక్కడనున్న వారిలోఁ బదుగురొక్కవేళ నట్టివారున్న నెట్లని యొకప్రశ్న గలిగె. నేనంత తెలియక యీసమయమొనర్చితినా? ఒక్కఁడైన నిందున్నవారి యందట్టివాఁ డౌదవునాయని శంకించుచుండ నొకరికంటె నెక్కువ చిక్కనేచిక్కరు. అట్లొకవేళ సంభవించెనా నాపుత్రి యాపదుగురిలోలనే తనపతిని వరింపఁగలదు. అందుకేమాలోచన.

ఉ॥ కన్నియ కెందు నట్టివిలుకాఁడు లభింపకయున్నఁ గన్యయే।
యున్నవలాచెలంగఁగల దామరణంబునుదీనదోష మే।
మున్నది మీనము న్గెడపునుర్వివరుల్బహుసంఖ్యగల్గిన।
న్మిన్నక వారిలోన నొకని న్వరించుట కేమికష్టమో॥

దుర్యో—(శకునితో) మనమేమిచేయదము? ఇదివిషమపరీక్షగాఁ దోఁచుచున్నది. మొదట నీవిల్లెత్తుటకే సాధ్యము లేదు.

శకు—(దుర్యోధనునితో) నాకుఁజూడ నిట్టిప్రతిజ్ఞయుండుటయే మేలు. ఎందుకన్న వినుము. ఈవచ్చినరాజలోకమంతయునంతంతయే. ఏమయిన నీవిల్లెక్కువెట్టి బాణము వేయవలయు నన్న మనకర్ణుఁడొక్కఁడే. వాఁడు యంత్రమీనముందెగనేసెనా, నీకే యీద్రౌపది లభింపఁగలదు. ఒక్కవేళకర్ణునకిది యసాధ్యమాయెనా, యితరులకు నసాధ్యమే. అప్పుడు బలవంతమున మనకార్యము సాధింపవచ్చు. (ప్ర) రాజవరులారా! మన మాహూతులమై యీరాజన్యునింటికి వచ్చియున్నారము. మనమీతని యిచ్చచొప్పున నే మెలంగవలయు. ఎట్టిప్రతిజ్ఞగాని, సమయముగాని నియమించుట కాతనికిఁబూర్ణస్వాతంత్ర్యముగలదు. మనచేతనాయెనా, దానిఁబూనుదము. కాకుండెనా, పండుగ భోజన మొనరించి గెలిచిన రాకుమారుని యానందముచూచి పోవుదము. ఎప్పటికేఁగాని యీరాకుమారి కొక్కఁడేకదా పతికాఁగలవాఁడిందఱిలో? మిగిలిన యందఱికిఁబండుగ భోజనమేకదా?

1వ రాజు—ఎవరేమైన నందురుగాక నాకేమో తోలుతనుడువని యీప్రతిజ్ఞ యసమంజసమని తోఁచుచున్నది. ఈరాజన్యునితో నిదిమానుమనవలయు. మానకున్న యుద్ధమునకు నిలువుమనవలయు.

శకు—ఇందున్న రాజలోకము నభిప్రాయము నడుగుదుము. అయ్యా! మీరెల్లరేమందురు?

1వ రాజు—ఎవరునేనుడుగవలయు? ఇందుకుఁ బంచాయతి కావలయునా? ద్రుపదరాజేంద్రా! ఈధను వెత్తి పారవేయించి నీకూఁతురింబతింవరింపఁగాఁ జేయుదువా లేక యుద్ధమునకు నిల్చెదవా?

శకు—కురుకుమారులారా! మీరొక నూర్గురికంటె నెక్కువగానున్నారు, మనమందఱమీయుద్ధమున ద్రుపదరాజునకు సహాయముగానుండవలయు.

2వ రాజు—(ఒకటవరాజుతో) రాజేంద్రా! ఇందఱికిఁగాఁబట్టనిపని మనకేల? ప్రతిజ్ఞ ప్రకారమే సైకొందము.

శకు—ఇది మెచ్చవచ్చు! రెండురాజవరులారా! ఏలయింకాలస్యము? మత్స్యయంత్రము తెగ వేయుఁడు.

1వ రాజు—(మఱియొకరాజుతో) మిత్రమా! కాంపిల్యా! మాయందఱిలో నీవే బలవంతుఁడవు నీవుపోయి ప్రయత్నింపుము.

కాంపి—(పోయిధనువుంగదలింపలేక వెనుకకువచ్చును).

శకు—(పోయిధను వెత్తి యల్లెయూడ్చును. కొంతతక్కువగాఁ గొనవలకువచ్చి యెక్కిడలేక వెనుకకువచ్చును).

జరా—(అట్లే).

శల్య—(అట్లే)

కర్ణ—(పోయి యధికప్రయాసమునఁ బదిమారులుప్రత్నించి ధనువెక్కుపెట్టును).

అందఱు—(కరతాళధ్వనులుచేయుదురు).

కర్ణ—(బాణము సంధించుటకని యొంటిచే విల్లుబట్ట నదిపలుమారు తనపైఁబడును. భుజముపై వేసికొని పట్టిబాణము ననుసంధింప, లక్ష్యమునకు సరిగారాదు. నానావిధములఁ బ్రయత్నించి యంగవికారములొనరించి బాణములవిడువఁబోవ, నారివదలి విల్లుచక్కనగును. మఱలనారివెట్టుటకెన్ని ప్రయత్నములుచేసినను దిలమాత్రము తక్కువగా నిట్టూర్పులు విడుచుచు విఫలప్రయత్నుఁడై వెనుకకువచ్చును).

శకు—ద్రుపదరాజేంద్రా! ఈయంగరాజు సామర్థ్యమెంతని వర్ణింపవచ్చును? వీరులగు వారు కదలింపనేరని ధనువు సజ్జగావించి బాణముసంధించె. ఇంతకంటె నెక్కువగాఁ జేయఁగలవారుండరున్న నీకూఁతునీతని యాధీనమునకు నీయవలసివచ్చెడు.

పురో—రండింకెవరైన రాజపుంగవులు. అయ్యా! కురుకుమారులారా? మీరులెండు.

దుర్యో—మాకురుకుమారులెవ్వరికి నిక్కార్యముపై నపేక్షలేదు. మాయంగరాజు సాధించిన మేమందఱము సాధించినట్లే.

పురో—అయ్యా! కోసలరాజా లెమ్ము.

కోసల—నాకు నిన్ననే రెక్కనొప్పి వట్టియున్నది. రెండుమూఁడు దినములుతాళిన నేనుంకించుచుంటి.

పురో—అయ్యా! మగధేంద్రా!

మగధ—విల్లెకుపెట్టవచ్చుఁగాని నాకుఁగంటినొప్పివలన నంతలక్ష్యమునకు సాధ్యములేదు.

పురో—అయ్యా! కరూశపాలా!

కరూశ—ఏమయ్యా! నీయధికప్రసంగము! ఇచ్చవచ్చినవారు వచ్చెదరు నీవేలపిలువవలయును?

పురో—గౌళభూధవా!

గౌళ—బ్రాహ్మణా! నీకేమి కన్నులుకానరావా! ఈద్రౌపతి నాకు చెల్లెలువరుస కాదా?

కొంకణ—నిక్కము నాకును చినతల్లివరుసయగు.

ఘూర్జ—(లేచి ముందఱికివచ్చును).

పురో—ఇదే! ఘూర్జరవిభుఁడు వెడలె, రమ్మొయెడకు.

ఘూర్జ—నే వెలుపలికిఁబోయి వత్తును. కొంచముపనియున్నది.

పురో—ఇంకెవరు విల్లుమోపెట్టి యత్నించువారీరాజలోకమునలేరా?

సాత్యకి—(కృష్ణునితో) నేఁబ్రయత్నింతునా లేక నీవుప్రయత్నింతువా?

కృష్ణ—(సాత్యకితో) సాత్యకీ! మనకువలదు. చూతమేమి జఱుగఁగలదో?

పురో—లేరా? రాజులెవ్వరులేరా? రాజులెవ్వరులేరా? రాజులెవ్వరు?—ఈనిండియున్న సభలోనున్న ధానుష్కులలో నెవరుగాని యీధనువున మత్స్యయంత్రముం దెగవేయువారులేరా?

ఉపేంద్ర—(బ్రాహ్మణులలోనుండి లేచును).

పురో—అయ్యా! ధనువుపట్టవచ్చెదవా!

ఉపేంద్ర—ఏమో ప్రయత్నించిచూచెద.

పురో—నీనామధేయమేమి?

ఉపేంద్ర—ఉపేంద్రుఁడని నన్నందురు.

1వ బ్రాహ్మ—ఏమయ్యా! మత్స్యయంత్రమనఁగా నేమనుకొంటివి?

ఉపేంద్ర—మత్స్యయంత్రమనియే యనుకొంటిని.

శకు—(దుర్యోధనునితో) సుయోధనా! వాఁడర్జునుపోలికగలవాఁడు.

దుర్యో—అవును పోలికంతయు నట్లేకాని యర్జునుఁడెక్కడరావలయు?

శకు—మనుష్యునిపోలిక మనుష్యుఁడంతియె.

2వ బ్రాహ్మ—బ్రాహ్మణా! ఏలయీసాహసమునీకు? ఇందరు హేమాహేమీలు రాజుల చేతఁగానిపనికి నీవుద్యమింపవచ్చునా?

3వ బ్రాహ్మ—ఇది దర్భపవిత్రమనుకొనినాఁడు.

4వ బ్రాహ్మ—ఊరకుండురా! ఏపుట్టలో నెంతపామున్నదో మనమెఱుఁగుదుమా?

3వ బ్రాహ్మ—ఊఁ! ఈపుట్టలోనింతపామున్నదిలే.

5వ బ్రాహ్మ—ఈబ్రాహ్మణుఁడూరకైన నుండక యీకార్యమునకుఁ బోవుచున్నాఁడే. అందఱునవ్వినప్పుడు మనకంతయు నవమానమగునే.

4వ బ్రాహ్మ—చాలులేరా! మీతాతగంటతయుఁ బోవునేమోకదా?

ఉపేంద్ర—(ధనువునొద్దకు రాఁగా)

పురో—(ద్రుపదునితో నేకాంతమాడి) బ్రాహ్మణోత్తమా! బ్రాహ్మణులయినను సరియె. యంత్రమత్స్యముం ద్రెంచిన కన్నియనొసఁగుటకుఁ బాంచాలరాజొప్పుకొనుచున్నాఁడు. ఏమిచేయువలయుటయు నెఱుఁగుదువా?

ఉపేంద్ర—అన్నియు నెఱుఁగుదును. రెండుగంటలనుండి చూచుచుండలేదా?

శకు—(స్వ) ధ్వనియు నర్జుననిదె. ఇదేమాశ్చర్యము? లక్కయింటినుండి తప్పించుకొన్న వాఁడర్జునుఁడేయుండునా? అట్లయిన దశరూపుఁడు రచించిన యుధిష్ఠిరమరణనాటకమున కర్థమేమి. కాదు. కాదూరకభ్రాంతి.

సుయో—కర్ణునుద్బోధింతమా!

శకు—వలదు రోఁచింపకుము. వీఁడీమత్స్యయంత్రము గెడపెనా యర్జునుఁడేయగు. కర్ణున వీఁడర్జునుఁడనుమాట దెలుపకయే వానిఁబ్రేరేపింతము. అర్జునుఁడొక్కఁడున్న మా మున నేమిభయము ?

ఉపేంద్ర—(ధనువుపట్టివంచి యల్లెబిగించి టంకృతిగావించి యొకబాణముననే మత్స్యవ్రదెంచి) రాజేంద్రా ! మిగిలిననాల్గుబాణము లేమి చేయవలయు ?

శా॥ పాంచాలక్షితనాథ ! యీమహితచాపం బెత్తుశూరాళికిన్ ।
బాంచద్రీతిగయంత్రమీనమునురూపం బార్పఁగానిచ్చితీ ।
పంచాస్త్రంబులనందునొక్కశరమే భంజించిమత్స్యంబుమా ।
యించెన్ జికిన్ నవేమొనర్తుఁజెపుమాయీనాల్గుబాణంబులన్ ॥

(అని దుర్యోధనునిత్టు గుటినిడును).

(బ్రాహ్మణు లత్యాధముగా నఱచి కేకలు వేసి గుడ్డలువిసరుచుఁ గూయుదురు.)

1వ బ్రాహ్మ—బ్రాహ్మణుఁడు—బ్రాహ్మణుఁడు—ఎట్లు—దెబ్బ !

2వ బ్రాహ్మ—మనవాఁడొకఁడు పనిచేసియున్నాఁడు చాలును. ఇట్లుకాకున్న మేమొక్కొక్కరముపోయి యీకార్యమొనర్చుచుంటిమి. బ్రాహ్మణులకపకీర్తి తెత్తుమా ?

(ఉపేంద్రునిపైఁ బుష్పవృష్టికురియును).

కృష్ణ—(ఉపేంద్రుకంఠమునఁ బుష్పమాలికవేయనెత్తును).

బలరా—కృష్ణా ! ఎందో ! ఈబ్రాహ్మణునిఁ జూచినట్లున్నది.

కృష్ణ—ఊరకుండు మిందేమో సంరంభము జఱుగఁబోవునట్లున్నది. అతఁడర్జునుఁడుగానున్నాఁడు ?

బల—అర్జునుఁడు ! అయిన లక్కయింటఁబాండవులు దగ్ధులుకాలేదా ?

కృష్ణ—నేను నాఁడే చెప్పలేదా పాండవులెందో యుండవలయుఁగాక కాలియుండరని ! బకునిజంపినది భీముఁడేయైయుండునని ?

బల—కాలిన శవములగపడినట్టు వింటిమే.

శకు—(ఇంతవఱకుఁ గర్ణునితో నేకాంతమున మాటలాడుచుండును).

కర్ణ—(ఉపేంద్రునధిక్షేపించి) బ్రాహ్మణా నీవేమో మత్స్యయంత్రము తెగవేసితివి. ఒప్పుకొంటిని. అయిన నింతమాత్రమునకే యీపాంచాలి నీకుదక్కునని యెంచకుము నేనును విలువంచి బాణము సెక్కుపెట్టినదియు నాయుద్యమమున నారివదలిపోయినదియుఁ జూచితివి, అటువదలినకాలమున నాబిగువునఁజేతికించుక ధనువుదెబ్బవడిగాని

యగుటచే మరల నాకోదండము సజ్యగావించుట కనువుపడదయ్యె. ఈపాంచాలి పాణిగ్రహణమునకు నేనును నించుక స్వాతంత్రియము గలవాఁడ నేయగుదు. మనబాహుబలముల పరిమితి మీరాజులోకమెల్ల నెఱుఁగవలయు. యుద్ధమునకునిలువుము. ఈవైపున మంచిపోటున్నది రమ్ము. (కర్ణుఁడును ఉపేంద్రుఁడును బ్రక్కకుఁబోవుదురు)

1వ రాజు—ఆహా! ఏమి యీశూరులయుద్ధము! ఏమి యస్త్రపాండిత్యము! ఎందును జూడలేదుగదా?

2వ రాజు—అదిగో! బాణసమితి యుభయులు విడుచుటచే నందు గాఢాంధకారమయ్యె. యీబ్రాహ్మణుని.

1వ రాజు—కాదిదిపర్జన్యాస్త్రముల మాహాత్మ్యము. మేఘములుద్భవించి చీఁకటిచేసినవి.

2వ రాజు—అదే! కర్ణువాయవ్యాస్త్రమున నామేఘాస్త్రము పటాపంచలయ్యె.

1వ రాజు—అదే! యామహాశూరుని యాగ్నేయాస్త్రము.

2వ రాజు—భళిరా! కర్ణుని వారుణాస్త్రప్రభావము.

1వ రాజు—భళీ, భళీ, ఏమియీనేర్పు! ఎన్నిబాణములువేయుచున్నను, నొకరిబాణములింకొకరికిఁదగులక నడుమనే యొకటిచేనొకటి కొట్టువడుచున్నవి.

2వ రాజు—అదిగో! కర్ణునిబాణ మీమహాశూరుని యెడమచేతికిఁదాఁకె.

1వ రాజు—ఆబ్రాహ్మణుఁడెట్లు కోపోద్దీపితుడగుచున్నాఁడు. వేసె—వేసె.

2వ రాజు—అయ్యో! బాణపంచకము కర్ణుని వక్షస్థలకవచము చించుకొని తాఁకె. ఆహా! అంగరాజు మూర్ఛిల్లె.

దుర్యో
శకు { (కౌరవులతో సంరంభముచేయుదురు).

2వ రాజు—అదిగో! కర్ణుఁడు తెప్పిఱిల్లిలేచె. ఏమోచెప్పుచున్నాఁడు విందము.

కర్ణు—(వెనుకనుండియే జనులు వినునట్లుగా) భూసురోత్తమా! నీధనుర్విద్య మెచ్చితి. సంతసించితి. మీబ్రహ్మతేజము మోఘము. స్వాప్రకార్యమునకై యీకలహమూరక పెంచవలయునని నాకభిలాషలేదు. పోయి సంతోషముగ వివాహకార్యము నెఱవేర్చుకొనుము.

2వ రాజు—ఆహా! కర్ణుఁడిక్కడికిరాక యట్లేవెడలె. ఈభూసురుఁడెవ్వరో దివ్యాస్త్రవేదిగానున్నాఁడు.

(అర్జునుఁడు ఎడమభుజమున నెత్తురుతో ధనుర్ధరుఁడై రంగమునఁ బ్రవేశించును).

శకు—(సుయోధనునితో) వీఁడర్జునుఁడే యయి యుండఁబోలు. ఎవఁడైననేమి? మనమిందఱము న్నారము. వాఁడొక్కఁడు. పోవనీరాదు. (ఇతరరాజులతో) రాజవర్యులారా! ఈబ్రాహ్మణుఁడు మత్స్యయంత్రము దెగవేసిన యాకస్మికకృత్యమునకే మనమందఱ మవ

మానమును మ్రింగుకొని, యీరాకన్నియ నితనికి విడువవచ్చునా? ఈయవమానమునకంతయు
మూలకారణమగు నీద్రుపదునితోఁగూడ నీబాపని గట్టివేయుఁడు

అందఱు—(లేచి బాహాస్ఫాలన మొనర్చి విజృంభితురు).

బ్రాహ్మణులు—సోదరులారా! మనముమాత్ర మూరకుండఁజనునా? ఈరాజాధములు
చూడుఁ డెంత యవమానోక్తులాడుచున్నారు. (అని పంచెలుత్రిప్పుచు విజృంభింతురు
అల్లోలకల్లోలమగును.)

దశ—(ఒక యీల వేయును).

కృష్ణుఁడు—బ్రాహ్మణోత్తములారా! నిక్కళింపుఁడు. రాజవర్యులారా! ఆలకింపుఁడు. మీకీ
బ్రాహ్మణోత్తము నధిక్షేపించుమ నతనిపైఁ గవియుటధర్మమా? అతఁడేమపరాధ
మొనర్చెను. మీరొక్కరైన నెత్తఁజాలనిధనువెత్తి సజ్యఁగావించి మత్స్యయంత్ర మధిక
కౌశల్యమునఁ దెగవైచినది యతనితప్పా? ఇందుకై మీరందఱు నతనిపైఁబోయెదరా?
యాదవోత్తములారా? మీరును లెండు. మనము నీబ్రాహ్మణునకు సాహాయ్యమొన
ర్తము.

(ఇంతలో శీఘ్రగమనమున శతానందుఁడు శ్రీకంఠుఁడు మొదలైనవారు వెలుపలనుండి
ప్రవేశించి యుపేంద్రునకు సహాయులై నిలిచెదరు).

(అంత సమ్మర్దమునుంచి యొకరినొకరు కొట్టుకొన నుంకించుకాలమున).

దశ—తాళుఁడు-తాళుఁడు. నామాట యించుకవినుఁడు.

శత—(స్వ) ఇదేమాశ్చర్యము. పాండవులెల్ల నిక్కడనే పునరుద్భవమొందినట్లున్నదే వీఁడు
దశరూపుఁడు. అయ్యో! గ్రహచారమా? ఇదియెవ్వరి మృతసంజీవనీప్రభావము?
భస్మముగాఁగాలినశవములు మరలబ్రతికింపఁగల మందుండునా?

దశ—శకునిరాజేంద్రా! సుయోధనరాజేంద్రా! మీరు యుద్ధప్రక్రియకుఁ గడఁగఁజనునా?
మీ కార్యములన్నియు నొక్కయింటితోనే పరిసమాప్తములు కాఁదలయుఁగదా?

సుయో } ఎవఁడవురానీవు బ్రాహ్మణదురాత్ముఁడవు? (అని పైకిఁబోవును).
కౌరవులు }

శకు—(వారించుచు) సుయోధనా! ఇదివేళకాదూరకుండుము.

దశ—వేళయెన్నటికైన నగునా? పురోచనుఁడు సహితములేదుగదా?

సుయో—(దశరూపుని కొట్టును).

శ్రీక—(సుయోధనుని గుద్ది) దురాత్మా!

సుయో—(క్రిందఁబడి మూర్ఛిల్లును) (అల్లోలకల్లోలమగును).

[లోపల బ్రాహ్మణులు.]

శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాధురీణార్యసార్వభౌమాచార్యాః దుర్గమ వేదారణ్యబుజుమార్గధర్మకాచార్యాః అమోఘనీతిదాయకప్రతిష్ఠాపనాచార్యాః నిగమాగమపరాకాష్ఠాపరిశీలనాచార్యాః బ్రహ్మాండాంతర్గతశాస్త్రసర్వస్వపారంగతాచార్యాః శ్రీమత్పరాశరయోగీంద్రసుకృతపరిపాకసంభూతాచార్యాః శ్రీవేదవ్యాసాచార్యాః— పరాకు (అని యేక కంఠముగాఁ జెప్పుదురు).

(అందఱు నాలకించిరేచెదరు. చేతులుజోడించుకొందురు).

బ్రాహ్మణులు—(మరల పైపరాకుచదువుకొనుచు రంగమున వేదవ్యాసులతోఁ బ్రవేశింతురు) (అందఱు సాష్టాంగ నమస్కృతులొనర్తురు).

శకు—(సుయోధనునితో) మనకిందుండ సమయముకాదు. గ్రహచారముచాలదు. పాండవుల భూతములేవచ్చియున్నవి. ఆవిచారమంతయు రహస్యమున మాటలాడుకొందము. ఈవేదవ్యాసుల యాగమనపు గజిబిజిలోననే తప్పించుకొందమురమ్ము.

సుయో—ఆదుబ్బబ్రాహ్మణుఁడు నన్నెంతగా గ్రుద్దెను. వానిమార్గ మెఱుఁగక రమ్మంటివా?

శకు—అయ్యో! ఎక్కడి దుబ్బబ్రాహ్మణుఁడు ? వాఁడేభీముఁడు.

సుయో—భీముఁడు! భీముఁడు! ఎట్లు బ్రతికివచ్చె ?

దశ—(వీరిమాటలు వినుచుండి) మీకొంపలార్పను జావకుండ బూనిబ్రతికి వచ్చియున్నాఁడు. అంతయేకాక, ధర్మసుతుఁడు గవలును, నదిగోవారే. వారును లక్కయింటి బూదినుంచి యీరెండు వత్సరములును జచ్చియుండినారు. నిలుండు. వారు బ్రతికి వితుపైన వృత్తాంతమంతయు, నీసభనున్న రాజలోకము నెదుటనే యెఱ్ఱగించి పనుద్ఘోషించితి. (సభలోనికిఁ బోవును).

శకు—(సుయోధనునీడ్చుకొని మిగిలిన కౌరవులతో నిష్క్రమింతురు).

(రాజలోకమును, బ్రాహ్మణులును సద్దడఁగి కూరుచుందురు).

వ్యాస—ద్రుపదరాజేంద్రా! నీపుత్రి స్వయంవరమున కెందఱో రాజులు [illegible] లే?

ద్రుప—[illegible]! నీయా [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] వచ్చియున్నారు. అయినను నేర [illegible] మత్స్యయంత్రము భేదించిన మహాకార్యశీలి బ్రాహ్మణోత్తముఁ డొకరించి, మాతనయపాణింగడించి మాకెల్ల నానందమునించె.



(అనుబంధము 30)

ఇంతలో క్షుద్రరాజులు కొందఱు దుడుకుతనమునఁ బోరసెంచిరి. అల్లకల్లోలమైె మాకృష్ణ యీమహాత్ము మెడ నునుపుటకెత్తిన మణిహారమట్టే యెత్తికొనియుండవలసె. భవదాగమనమున గజిబిజియంతయు నడఁగి సమ్మదమ్మునించె. కృష్ణా! ఇంకేటి సంశయము? ఈమహాత్ముల యెట్టయెదుటనే, నీవు పతింవరవై యాశీర్వాదముల వడయుము.

కృష్ణ—(పూలహారమెత్తి యుపేంద్రుని కంఠసీమ వేయఁబోవ).

ఉపే—(వారించి) ద్రుపదరాజన్యా! నాకీకన్నియఁ జెట్టపట్టుట కర్హతలేదు. మాయన్న యీతఁడు (అని శతానందునింజూపి) అవివాహితుఁడు. అతనివెనుక నితఁడు (శ్రీకంఠునిజూపి) మాయింకొకయన్న. వీరిరువురు నవివాహితులైయున్నారు.

(అనుబంధము 31.)

మాయగ్రజుఁడగు నీశతానందుఁడే యీకన్నియం బరిగ్రహింపఁగలవాఁడు.

శతా—(కృష్ణంజూచి) (స్వ) ఆహా! ఏమి యీవింత విలాసవైభవము (ప్ర) నాతమ్ముఁడా ర్జించిన పదార్థము నేఁగాంక్షింపవచ్చునా? మాయుపేంద్రుఁడే యీకన్నియకర్హుఁడు.

శ్రీక—(స్వ) ఈతరుణీమణి మనోహర రూపమెవ్వరికైన భ్రమింపఁ జేయఁజాలుఁగదా? (ప్ర) అయ్యలారా! ఈయుపేంద్రునికంటె నేఁబెద్దవాఁడనైన నేమాయె. ఈకన్నియ వానిస్వత్వమయగు.

కృశానుఁడు—(స్వ) ఆహా! మాయుపేంద్రుని యదృష్టము! ఇట్టిలావణ్యవతి లభించె. ఈరామంగాంచిన నెవఁడు మైమఱవనివాఁడు? తప్పాయె. తప్పాయె. నేనీరమణిని నిట్టి మోహబుద్ధి నీక్షింపరాదు.

చిత్రభానుఁడు—(స్వ) ఎంతో తపమొనర్చియుండఁగదా మాయుపేంద్రున కీశృంగారవతి లభించె. పాపము శాంతించుఁగాక, తల్లివోలెఁ జూడఁగల వదినియనిట్టు నేబలుకఁజెల్లునే?

ద్రుప—ఉపేంద్రాభిట్టా! మీయన్నలే మహోదారగుణమున నీకొసఁగిచ్చియుండ నింక శంక నేల? ఈకాంత ననుగ్రహించి పాణివట్టుము.

(అబంధము 32.)

ఉపే—తాళుఁడు. మతియొకగొప్ప సంశయమిందుఁగలిగె. (అని శతానందునితో నేకాంత మాడును).

కృష్ణ—(స్వ) బ్రాహ్మణులై యిట్టి మనోహరాకారముగలవారి నెందునెఱుఁగ. ఆయెడ నెవరో యిరువురు కొంచెము వీరిపోలికగలవారే యున్నారు. వారును గడుసూప వంతులు. వెయ్యేల రాజున్యు లిందుఁజేరియుండిరిగదా? ఈబ్రాహ్మణుల సౌందర్య మున దశాంశమైన వారికిలేదు.

శతా—రాజచంద్రమా! ఇందొక్క దీర్ఘధర్మ సంశయముగలిగె మాయమ్మ యానతిలేకయే యెవ్వరము నీతరుణీశిరోమణిం బరిగ్రహింపఁజాలము. ఆమెయొసంగియున్న యాజ్ఞ ప్రకారము మేముజరిపితిమా, యనర్థముగా ధర్మభంగము గలుగు. కావున మేము పోయి యాయమ్మ యానతిఁగైకొని యేతెంచెదము.

ద్రుప—అంతయేల? ఆయమ్మయెందున్నదో యెఱిఁగించిన నాయమనే యిక్కడికిఁ బిలువ నంపెద.

దశ—గుండప్పయను పేరుగల కుంభకారునియింట మావిడిది.

ద్రుప—(స్వ) ఔరా! ఆకుమ్మరిభాగ్యము! (ప్ర), సేవకా! పల్లకి సిద్ధముచేయించి గుండప్పయను కుమ్మరియింటికిఁబోయి—ఆయమనామధేయము?

దశ—కుంతిదేవి—కాదు—భవానిదేవి.

ద్రుప—భవానిదేవిగారిని వారికొమారులు పిల్చెదరనిచెప్పి పిలుచుకొనిరమ్ము. ఆకుమ్మరి వానినిగూడ నిటురమ్మనుము.

సేవక—భాగ్యము. (నిష్క్ర).

కృష్ణుడు—(బలరామునితో) అన్నా! ఇఁకనేల మనము యోచింపవలయు? ఆబ్రాహ్మణుఁడొనర్చిన పొరపాటువలన వీరితల్లి కుంతియని తెలిసెఁగదా. (ముందఱికివచ్చి శతానందు నాలింగనముచేసికొని) బావా! ఎన్నిదినములకు మిమ్ముఁజూడఁగంటిమి. లక్కయింట దగ్ధులైతిరని యెంతదృఢముగా నొరులుచెప్పినను, నేనమ్మకయుంటి. (తరువాత భీముని, యర్జునుని, గవల నాలింగనము చేసికొనును).

బల—(అట్లేయొనర్చును),

పాండవులు—(కన్నీరు నింతురు).

ద్రుప—కృష్ణా! ఏమిది? మీబావ యెవరు. లక్కయిల్లేమి? చిత్రముగానున్నదే.

కృష్ణ—ద్రుపదరాజేంద్రా! వీరెల్లఁ బాండవులు. నామేనమఱఁదులు. ఇఁక విశేషమేమి చెప్పవలయు?

సీ॥ మిత్రుఁడై ధర్మచరిత్రుఁడై పాండురాట్పుత్రుఁడైన
యజాతశత్రుఁడితఁడు।
భీముఁడై దనుజవిరాముఁడై యతిబలోద్దాముఁడైన
జితారిభీముఁడితఁడు।
భానుఁడై రుచినసమానుఁడై ధన్విప్రధానుఁడైన
మహేంద్రసూనుఁడితఁడు।
సుకలుఁడై ధీవిధావికలుఁడై విదితధర్మకలుఁడై
వెలయునా నకులుఁడితఁడు।

తే॥గీ॥ జీవ్యుఁడై మేధనమితప్రభావుఁడైను।
భావుఁడై తనరిన సహదేవుఁడితఁడు।
అవనినాయక పంచపాండవులువీరె।
కేవలకృపాదరులు లసత్కీర్తిపరులు॥

బ్రాహ్మణులు—ఓరీ! ఇంక మన ప్రభావముపోయె. దక్షిణనే చూడవలయు.

ద్రుప—ఆహా! ఏమి నా పుణ్యము! వీరు లక్కయింటఁ గాలిరని యత్యంతము దుఃఖించితినే ఇప్పుడు రూపములు స్మరణకు వచ్చుచున్నవి. ఈ యుపేంద్రభట్టారకుఁ డర్జునుఁడే యవుఁగా?

వ్యాస—ఈ కారణమువలనే రాజేంద్రా! నీయొద్దకే నేతెంచితి.

సేవక—దేవా! పల్లకి వచ్చియున్న దావైపుననున్నది.

శతా—అయిన మేముపోయి మాటలాడివత్తుము.

(పాండవులు నిష్క్ర).

ద్రుప—(దశమాపునితో) అయ్యా! నీ వెవరవు?

దశ—రాజేంద్రా! నేగాంధార దేశముననున్న శిల్పిశాస్త్రజ్ఞుఁడ. ఈశకుని సుయోధన రాజేంద్రులవలన—(దిక్కులు చూచి) ఆహా! వారుపోయినారులే. ఉందురా?—వారి వలన నియమింపఁబడి పాండవుల దహించుటకై యద్భుతభంగి లక్కయిల్లు నిర్మించి, విధాతృవశంబునఁ దనపతితభగినియగు తుంబరతోడను దత్పుత్రి దుర్గాత్మ చతుష్టయముతోడను, దానే యాలక్కయింట దహింపఁబడిన పురోచనుఁడను శిల్పికిఁ బితృవ్యపుత్రుఁడ. దశమాపుఁడనువాఁడ: లాక్షాగృహదహనము మొదలీ పాండవులనే యాశ్రయించి యుంటి.

ద్రుప—ఆహా! అట్లనా? అందుకే కాఁబోలు వీరితల్లి పేరు చెప్పుటలో దొలుతఁ గుంతీదేవి యని, త్రిప్పిరి.

కృశానుఁడు—(ప్రవేశించి) ద్రుపదరాజన్యా! ఒక్కింతయవ్యేడకు విచ్చేయవలయునని మాయన్న ధర్మసుతుఁడు ప్రార్థించుచున్నాఁడు.

ద్రుపద— (కృశానునితో, నిష్క్ర)·

బల—దశరూపా! నీచరిత్రము పరమానందాయకము. పోనీ! పాండవులేల యిన్నాళ్లు డాఁగియుండిరి?

దశ—అయ్యా! అదియొక పెద్దకథ. తనకుఁగల యౌవరాజ్యకారణమునఁ దనపై సుయోధనాదులీదుష్కృతికిఁ గడఁగిరని నమ్మి సుయోధనునకే యౌవరాజ్యమిచ్చు తాత్పర్యమున—

[ప్రః కృశానుఁడు.]

(వ్యాసులకు నమస్కరించి) ఋషివతంసమా! అంతవఱకు విచ్చేయుదురా? (కృష్ణ బలరాములతో) బావగారూ! తామును వేంచేయవలయు.

(కృష్ణ, బలరామ, వ్యాస, చిత్రభానులు నిష్క్రమింతురు.)

(ముందటి యవనికపడును.)

[ప్రః గుండప్ప (పక్కీ)]

(అనుబంధము 33.)

గుండప్ప—అయ్యలారా! నాగతియేమి. మారాజెందుకు నన్ను పట్టుకరమ్మన్నాఁడు. నే నేమి చేసినాను. ఎంతనేపునిలవాలె నన్నేమిచేస్తారు మాయింట్లో బిడ్డనోళ్ళకు, నే నేమిచేయలేదే. వాళ్లు నామీద రాజుతో యేమేమో కొండ్యాలుచెప్పినట్టుంది. నన్నేమి సేస్తారో. బాపనోళ్లకు చోటియ్యరాదనేది నిజమే. అయ్యో! అయ్యో! (అని దుఃఖించుచు నిష్క్ర).

(వెనుక యవనికనెత్తగా స్వయంవర గృహము. గుండప్పయునుండును).

1వ రాజు—ఔరా! ఏమి సుదినము నేఁడు!

2వ రాజు—ఇట్టి మహిమోపేతులగు పాండవులు లక్క యింటఁ గాలుటయన్న నమ్మ వచ్చునా?

1వ రాజు—అర్జునుఁడు కాకున్న బ్రాహ్మణ మాత్రునకు మత్స్యయంత్రము దెగవేయనగునా?

1వ బ్రాహ్మ—అయ్యా! ఇంతూరకుండుము బ్రాహ్మణ ప్రభావము నీవే మెఱుఁగుదువు! అర్జునుఁడు సహితము బ్రాహ్మణరూపముపూని యున్నందునఁ దత్తేజమునిండి యీకార్య మొనర్చెఁగాని యూరకరాజై వచ్చియుండవలసియుండె నెట్లగుచుండెనో?

(అనుబంధము 34.)

1వ రాజు—లేదయ్యా! మేమూరకుందుము. మీప్రభావమే ప్రభావము. లెండింకేల? మీభోజనమునఁ బ్రభావముచూపుటకు వేళయాయె.

1వ బ్రాహ్మ—మాభోజన ప్రభావముండనీ. అయ్యా! నీవు శూరాగ్రేసరుఁడవగు క్షత్రియుఁడవు. ఆవిల్లింతయెక్కు పెట్టుము.

2వ రాజు—అయ్యా! మాక్షత్రియతయేమి ప్రభావము? మీయదిగదా బ్రాహ్మణప్రభావము? మీవేషము వేసికొనినందునకే యర్జునునకంత సామర్థ్యము కలిగెనంటిరి నిక్కమే. ఏదీ! మీరింత యెత్తి చూడుఁడు.

1వ బ్రాహ్మ—ఎత్తిచూడనేల? దానినింత యెక్కువెట్టి యిక్కడికిఁదెచ్చియిందు. ఇక్కడ నిల్లేపండుకొని బాణమువైచెద.

1వ బ్రాహ్మ—ఇదియేరా చిదంబరరహస్యము! ఒక్కరొక్కరేపోయి యింతసేపయ్యారాకున్నారు.

[ప్ర: ద్రుపదుఁడు, పాండవులు, కృష్ణబలరాములు, వ్యాసులు]

కృష్ణ—సదస్యులారా! ఇందొకనూతన విధానమేర్పడినది. తల్లిమాట నెన్నఁడుగాని యీ పాండవులు మీఱినవారుకారు. ఏవృత్తాంతమును దెలియకమునుపు వీరికెట్టిఫలము కలిగినను—

వ్యాస—మొదట కృష్ణనడుగుఁడు.

ద్రుప—అవును. కృష్ణా! నీవు మనసు గోప్యముచేయక వచింపుము. ఈ యేవురును బాండవులు వీరిలో నెవ్వరు నీకిష్టులు.

కృష్ణ—(సిగ్గుతో) ఆయేవురు నాకిష్టులే.

వ్యాస—చూచితివా! రాజేంద్రా! విధి విధానమేల తప్పును?

కృష్ణ—ఋషిచంద్రమా! సత్యము. ఈకుంతీదేవి వీరికెట్టిఫలము లభించినను నేవురు నుపయోగింపుఁడనియెనఁట. అర్జునునకుఁ గలిగినఫలమీకన్య. ఈఫలము నేవురెట్లుపయోగింపవలయు ననుమథన యీవఱకుఁగలిగె. ఈవ్యాసర్షి లీధర్మముదీర్చిరి ఈయింతి పూర్వజన్మమునఁ "బతింఁదేహి" యని యేనుమాఱులు వరముగోరినందున నీకరణి

తటస్థించినది. అందులకు నిదర్శనముగా నేవురుండన కిష్టులేయని యియ్యెడ నామె నుడివె. కావున నేవురుపాండవులకుఁ బత్నిగా నీవలయునని వ్యాసులవారు తీర్చి యున్నారు. ప్రతిసంవత్సరమును నొక్కొక్కఁడీయమకుఁబతిగానుండువాఁడు. ఆకాలమున గర్భముధరించెనా, ప్రసవమువఱకు నతఁడే యీమెకుఁబతి. అట్టికాలమున నితరులీ మెనుమాత్రభావమునఁ జూడవలయు. ఈవర్తన యపూర్వమనితోఁచినను, విధివిధాన మును బెద్దలనియమనమును నున్నందున నిట్లే జరుగఁదగియున్నది. ఈయేవుర కీస్వయంవర రంగమున నేకకాలమునఁ గన్యాదానమహోత్సవము నెఱవేర్చినను, బిదప నీయూరున మొదట యుధిష్ఠిరరాజునకే వివాహకార్య మొనర్పఁదగియున్నది. తరువాత గడువులు తీఱినట్లంతయుఁ గ్రమముగా భీమునియు, నర్జునునియుఁ గవలయు, వివాహములు జరుగఁగలవు.

ద్రుప—సేవకా! ఈకుమ్మరగుండప్పను గొనిపోయి—

గుండప్ప—అయ్యో! అయ్యో! నేనేంచేస్తినయ్యా! బాపనయ్యలారా! ఏమిపుండు పెట్టితిరప్పా?

ద్రుప—గుండప్పా! భయపడకుము. నీవుపుణ్యాధికుఁడవు. మావియ్యమువారికి నీయిల్లు విడిదిచేసితివి. సేవకా! కొనిపోయి మాభాండాగారమున నితఁడెంత ద్రవ్య మపేక్షించునో, యంతయిప్పింపుము. అంతయేకాక యాతని యిల్లొక దివ్యభవనముగాఁజేసి యదియే మావియ్యమువారికి విడిదియిల్లుగా నొనర్చి, చేర్చినపదార్థములన్నియు, నీతనికే యొసంగుఁడు.

(ముందటి యవనికపడును).

[ప్ర: గుండమ్మ (దుఃఖముతో).]

(అనుబంధము 35.)

గుండమ్మ—అయ్యో! ఎంతమంచోళ్లన్నట్టుండ్రి బాపన్నాబట్టలు. ఏమిచేసిరమ్మా నా మొగుణ్ణి పట్టించిడారంట. ఏమిశెలిందారినిన్ను. ఎట్లాటి బాపనకుంకలే.

[ప్ర శీఘ్రముగ గుండప్ప.]

గుండప్ప—ఇదిగోవస్తి. సూసుకో, మనయిల్లంతా కొత్తగా నిర్మాలం చేస్తారట మేళ్ళు తూగుపంచాలు నిండిపోతాయి. దిమాము ఇట్లాటి బాపనోళ్ళెరాని (అని సంతోష ముతో నెగురులాడును).

(అనుబంధము 36) (నిష్క్ర).

(వెనుకటి యవనిక నెత్తుదురు).

(గుండప్ప, గుండమ్మ, పెండ్లియుడుపులతో నుందురు. సేవకులు కుమ్మరివారలను నూరకుండుమని చెప్పి సద్దునణఁగింతురు.)

ద్రుప—కుమారీ! కృష్ణా. చిత్రచరిత్రము, నీవు వరప్రభావమున జన్మించినదానవు. ఎంతయుఁ గీర్తి దెచ్చుదానవు ఇదే యీసదస్యుల యెదుట నగ్రజాదిగా నీపాండవుల వరింపుము.

కృష్ణ—(ఒకరొక్కరిమెడఁ బూలహారము వేయును. వారునుమాలలు ద్రౌపది మెడలో వేయుదురు, అందఱు కరతాళధ్వనులు చేయుదురు. మంగళముపాడుదురు).

మంగళం.

—: పాంచాలీ స్వయంవరనాటకము సంపూర్ణము :—

——:0:——

# ఉత్తరరంగము (Epilogue.)

[ ఒకానొక నటుడు ప్రవేశించి. ]

ద్విపద:—సురుచిరవిజ్ఞానశుభరీతివెలయు
నరుదారియున్న మహాజనులార
యలరఁ బాంచాలీస్వయంవర నామ
విలసితంబీకథ వింటిరిగాదె
తనరు నీచరిత కథానాయకుండు
అనిలజుండో యానో యర్జునుండగునో
వఱలు ఖరాయు ప్రోపాంచాలవిభుఁడో
మఱియటుగాక కుమ్మరిగుండఁడగునో
స్థిరరీతి మదిలోనఁ జింతించి మీరె
పరగంగ నిర్ధారపరుపంగవలయు
నదియుండుఁగాక యేపారంగ దీన
నెదివియుండెడుఁ గాదె యొకరహస్యంబు
భూసుర వేషముల్ పొలుపారఁ దాల్చి
భాసిల్లియున్న యాపాండవులెల్లఁ
బాంచాలపురిలోన భావంబులందుఁ
గాంచక నిల్వరే కుమ్మరియింట
దేవాలయములైన దిగుటకు లేవె
తా ప్రవేశింప సత్రంబులు లేవె
దీనియర్థంబింత తెలియఁగావలదె
మీ నెమ్మనంబుల మిగుల యోచించి

యిప్పటిమనవారలెన్ని యోగతుల
నొప్పనిభేదంబులుంచిరిగాక
బాపలకునుమతిబ్రాహ్మణేతరుల
కాపూర్వకాలంబునందుండలేదు
ఈమార్గమునభేదమెంచియేవేళ
మేమె యెక్కువయంచు మేమెక్కువంచుఁ
దొల్లిటిమనవారుదొడరిరేయెందు
విల్లసిల్లెడుమైత్రివెలసిరిగాక
ముఖ్యమీదుర్భేదబుద్ధియుండంగ
సౌఖ్యంబుగల్గునేజనులకునెందు
నైకమత్యముమానియఖిలరీతులను
బోకారినశియించిపోవుటేనిజము
వింతయామనభంగి వివరించిచూడ
నెంతదుఃఖమునించునెల్లవారలకు
దేశాభిమానంబుదిగజారిపోయె
లేశమైననుగూర్మిలేకుండనాయెఁ
గులములోనేమియెక్కువపుట్టినంతఁ
గులముగల్గునెజ్ఞానగుణమునఁగాక
వివిధవృత్తులచేతవెలసెనేకాక
యవనిలోఁబొలిచుకులంబనియేదిచెప్పుడు
నాలుగుజాతులునాల్గువేలయ్యె
నీలాగయిననింకనెక్కడికవధి
కలుషంబునించిదుఃఖమువెంచుఁగాని
కులదోషములనెంచగోరకుండయ్య
ఒగిభోజనముసేయనొప్పరోవలదు
పగపెలపొనిందువైరమేమిటికి

తనయులఁగానని వ్యధఁ బరొవ్వలదు
చనసింధువేలా యెశత్రుత్వమేల 48
హితమెంచువాఁడనుండీఘ్నసులార
స్థుతమతులార యొసోదరులార
అపకీర్తి మించు నెయ్యము పోనడంచు
కృపమానిపించు మిక్కిలి కూర్మిఁ జెంచు 52
ఖ్యాతి నడంచు దుఃఖము లెల్ల నించు
జాతికే వైరంబు చను దెందు నుండి
చెలుఁలార సతులార చెల్లియలార
యలజరాయువు కథనాలకించితిరె 56
బాలావివాహంబు పట్టనాధీర
లాలిశోపన్యాసలక్షణంబింత
పరికించితిరె మీరు వనజాతులార
వెరవారనది ధర్మవిధియగుఁగాదె 61
తనబిడ్డ ప్రౌఢయౌతఁ జేవచ్చె నన్నుచు
మనమున భీతిల్ల మార్గంబుగనక
యెట్టివానికినైన సీతని భార్య
కట్టుమంచ డగనికఁ జ్చ్చియొనర్చె 64
ఈజరాయువు శాస్త్రవృత్తంబు లెల్ల
నోజమై నెఱిఁగిన యోగ్యుఁడై యుంట
నీడు మీఱక యున్న యెలనాగ పెండ్లి
పాడిగాదని శాస్త్రపద్ధతిఁ బూనె 68
సరియీడు వడయని సతులకు నెందుఁ
బరిణయంబది యేమి పరిణయంబకట
ఆచారమా చారమని యుంగలార్త
రీచిత్రవిధిమది నెంచియున్నారె 72

అంధపరంపరయనురీతినిట్టి
సంధానమేలాగుచవినించెమనసు
యువతీవివాహంమేయుర్వినున్నెందు
సవిధసమంచితాచారంబుసుండి 76
ఈదురాచారమదేటికివెలసె
మేదినిపైననిమీరందురేని
నాకుఁదోఁచినకారణముచెప్పవాఁడ
ప్రకటకరుణపెంపారవినుండు 80
ఏకాలముననెయేమోవివాహంబు
కాకున్నయువతులఁగాంక్షించిబలిమి
నందిరాఁదీసెడునధికారులుండి
నందుననేమొయాయవరోధమడపు 84
వెరవుగానకతమవెలఁదులకెల్ల
నరసియొకకోటిసమర్థాడకమున్నె
నిరసింపనెట్టివానికినెనఁగట్టి
పరిణయంబొనరించుభంగివ్యాపించె 88
నలువారనిప్పుడన్ననుక్షేమరాజ్య
మలవడియుండనయ్యాచారమేల
మలగింపరాదునెమ్మదిచెందరాదు
కలహాణులారనికర్మమునెంచికనరె 92
అనయంబుమనకెల్లనలవడియుండి
తనరునాచారమెంతటిదుఃఖమొసఁగె
కొడుకుపుట్టఁగనిండుకుతుకంబునిండు
వడిబిడ్డయన్ననెవ్వగనివ్వటిల్లు 96
సుతయేమితక్కువసుతుఁడేమిహెచ్చు
సుతునకలరనేలసుతకేడ్వనేల

తనయకల్గినయంతధర నెల్లవెదకి
యనయంబుమనముఱియాడఁగన్నియకు
వెలయంగఁబడియేండ్లువెడలకమున్నె
కలిగియెవ్వరికైనఁగట్టంగవలయు
నాకూఁతురికిదాననధికదుఃఖములు
చేకూరమదిఁబొక్కిచేద్వడవలయు
నారయనాచారమటులుండఁగాదె
ఘోరదుఃఖముగల్గుఁగూఁతురుగలుఁగ
నతివపెండ్లికిమున్నమార్తవమైన
నతిపాపమనుమాటయదికల్లకల్ల
యీపాపమన్నదియింతికేకాని
యేపారమగవానికేటికిలేదొ
మిపులయోచింపనోమీనాథులార
యువతీవివాహమేయొప్పగునుండి
మానినులారమీమగలనీమార్గ
మూనంగఁగలిగింపుడుత్సాహగరిమ
అపుడుమానసశుద్ధియడరెడునుండి
అపుడుసంతోషంబులలరారునుండి
అపుడుకూఁతురుపుట్టినడలరునుండి
అపుడునిక్కపువివాహంబులౌనుండి
అపుడుపునర్వివాహముకాదునుండి
అపుడుమీసుతులుబలాఢ్యులునుండి
అపుడుజనాళిధీరాత్ములునుండి
అపుడుదేశమువృద్ధినలరెడునుండి

:0:

# అనుబంధములు.

అనుబంధములు.

1 రాగం-హిందూస్తానికమాజు. ఆదితాళం.

అందరు—అకాలమరణమున-కేమిచేతుము
దైవమా దైవమా-దైవమా-హా-హా-హా హా ॥ ॥పల్లవి॥
తాపముమీఱె-తలపుదీఱె-పాపమునించె
పంతముమంటె-రూపముమాసె-పాపలెనె-పాపలారా ॥
పాండవులెంత-పాటునకోర్చియుండిరో హాహా
యోర్వగజాల-మండిరటన్న-మాటకిన్ననుండజాల ॥

2 రాగం-బిలహరి. ఆదితాళం.

కోకిల—ఘనమగుజూడ-మనసునకొనియాడ
వనరమయెంతో-తనరెడినయ్యారె ॥
మేనక—బాలరసాలము లోలరంజిల్లెడు
తాలతమలహిం తాలములెల్ల ॥
కృష్ణ—మల్లెలుజాజులు-మొల్లలుసంపెంగలు
చల్లనితావులు-విల్లసిల్లెడునాహా ॥
శార్ఙ—కోకిలల్గూయగ-గోరవంకలేపారంగ
కేకులుతూగాడంగా-కీరముల్మాటడంగా ॥

3 రాగం-మోహనకల్యాణి. ఏకతాళం.

కృష్ణ—కన్నావెజననీ-యున్నావుగ
కన్నావె-మన్నించి-యున్నావె-మేనక ॥

అనుబంధములు.

ఎన్నంగసీనాతి-యన్నట్టులుండవలె
నన్న చెవులునోరు-కన్నులుమూయవలె ‖

4 రాగం-అఠాణ. ఆదితాళం.

శ్లో॥—తగువరుఁ-జేలేఁడుగా
తనయకు-నెందైనను‖ ‖పల్లవి‖
పొగులఁజెయుఁగాదెతలఁపఁగ
వగలునించిమెల్లెడ, పాయ-రాక-సఖి ‖
అందుమిగిలియున్న-పాండవేయు-నెందు
గాకున్న-గుందఁజేయునెందుతాపము
చందమయ్యె-డెందమందు-సుందరాంగియకట ‖ ‖౧‖

5 రాగం-జంఝూటి. ఏకతాళం.

ఏటుక—గద్దె-వినరెయీ-పురి-వారలు
సుద్ది-వినరుగా-బుద్ధి-గనరుగా ‖ ‖పల్లవి‖
బూములసుద్దుల-పొందుగాఁజెప్పెదఁ
నామాటనికఁటంబుగా-మేల్-మేల్ -నామాటనిక్కంబుగా
భామాలారా ‖ ‖౧‖
ఎల్లరునాసోదె-నింపుగగొందురు
కల్లన్నమాటొకఁటి-లెదుగా-కలన్న
మాటొక్కటి-కొల్లపురమ్మతోడు ‖ ‖౨‖

6 రాగం-సావేరి. ఆటతాళం.

ద్రుపద శ్లోకల } మమ్ముఁజూడవె-మానవతీమణి
నెమ్మదిఁ-గరుణించి-వేగమె ‖ ‖పల్లవి‖
ద్రుప—తరళాక్షికన్నువచ్చిచూచి
సరంసబునిందునింపవె-భరింపగాధరమానొకో
పరితాపమమ్మరో-గానవె ‖

అనుబంధములు.

శ్లోకి—అమ్మరో నినుజూచి మెగతి
నెమ్మదికా భరింపయింపుడుకా-సొమ్మసిల్లితి
దల్లడిల్లితి-సమ్మదమ్మున-గావవె ॥

7

రాగం-మోహన. ఆటతాళం.

ద్రౌప—నేనెట్లు జీవింతు-నేతల్లిరో నాదు-ప్రాణకాంతునిజూడక ॥
శ్లోకి—కాననివాడెట్టి-ప్రాణకాంతు డెనీకు-మానినీమణిచూడవె ॥
ద్రౌప—నానోపాయములను-బూనినాకివ్వవే-మానక నాప్రాణ-దానమే ॥
దృప—నీకేటి యజ్ఞానమే
ద్రౌప—దూరుటయభి-మానమే
శ్లోకి—ఈకరణిమిక్కిలి-న్యూనమే
ద్రౌప—ఘనవేణియాహిమభాను సుందరు నేను-బొందుదునే
దృప—స్వప్నమునజూచిన-ధ్యానమానుశుడెట్టిసుందరుడె
ద్రౌప—ఆరమణుజూడక-ప్రాణధారణమేను జేయుదునే
శ్లోకి—ఈభంగి జేసిన-మానినిరొనే- నేమిచేయుదునే
ద్రౌప—నావిధియిటుండగ-నేను సేయుటయేమిగలదిక
ప్రాణములనా-శింపకుండెద ॥
దృప—ధీ-నెలతయాహీనమతిబహుమానరహితముమానుమింక
ద్రౌప—సుందరాంగునినా-నందమొందగనింక-నెందైనగాంచెదనే ॥
శ్లోకి—సుందరికలలోజె-న్నొందుపదార్థము-లెందైననిజమౌనే ॥
ద్రౌప—నందనబహుళని-ర్బంధము భావక-మందెదూటుటయా-సంధమే ॥
దృప—నీకెట్టినిని-ర్బంధమే
ద్రౌప—ఈరీతి చెప్పుట-యంధమే
శ్లోకి—ఈభ్రాంతి యిదియె-చందమే
ద్రౌప—ప్రియవరుని బొందని-మంధభాగ్యముచందమింకేమె

అనుబంధములు.

దృప— నే వేడికొనియెడ-మందబుద్ధినిఁబొంద కేతనయా
ద్రౌప— హామదనసుమశర-బృందములనిం కెందుతాళుదునే
కోకి— ఈవర్ధచింతా-కందమునకేమందువెదుకుదు నే
ద్రౌప— ప్రియవనితరో హా-యిందుననుబాధించుదుఃఖము డెంధమంతయు
కలగజేసెను
దృప— సుందరీనీతంద్రియిందుకు-ముందుయోచనచేయగలడు.

8 రాగం-బేగడ. రూపకతాళం.

కోకి— తడయనేటికి-బరిణయమునకు-గడగుము
వెగ-బ్రాణ-నాయక-సుతకును ॥ ॥పల్లవి॥
దృప— తరళలోచన-నిజముపలికితి-వరయగ
నెందు-జూచి-కానమెవరునిక ॥ ॥పల్లవి॥
కోకి— క్షితిపాలా-వెతకంగా-దృతరాష్ట్ర-సుతుడుండగ
మతిదలపగ-సుతకింకొక-పతీయెవ్వఁడు ॥ ॥౧॥
దృప— కలవాణీ-బలురీతిగ-బలుకంగ-జెలువౌనె
వలదుమానము-తులువగడు-పలువగవిడు ॥ ॥౧॥
కోకి— చెన్నుగాజూనుమా-యున్నతిగ-రాజ్యసంపన్ను
డికెవ్వడు-వరుడెకనరాడాయెను ॥ ॥౨॥
దృప— ఇంతైనగ-గనుగొనవె-యింతీయం-తటితులువగ
జింతింపగ-మనకగునె-వింతయ్యెగ-గాంతామానుము ॥

9 రాగం-బిలహరి. రూపకతాళం.

కోకి— సారసాక్షి-యూరడిల్లవె-యోకీరవాణీ
నారీమణిరో-కోరిచూడవు ॥ ॥పల్లవి॥

అనుబంధములు.

తనయయింతటి-తాపమేటికి
మనసులోనదలంపవే-వినుముమానము
యోచన-తనరుగావివాహము ॥

10 రాగం-కాంభోజి. రూపకతాళం.

జర—చాలసంతసమాయెనాకును-మేలునిండెగా-మదిదలపగ॥
మేలివిద్యల-లీలనిట్టిడుభూలోకములెడని
వాలాయములాలింతురు॥ ॥అనుపల్లవి॥
ఘనరీతిగ-మనశాస్త్రము-లనునేర్చుచు
వినిపించుచు-జనుపాండితినార్జించిన
ఘనుడంచుచు-గణియించుచు
మనసారగగొనియాడరె ॥

11 రాగం-కేదారగౌళ. ఆదితాళం.

హేమ—ప్రాణనాయకా-కానందగునీవెలదిని
ఈనళినాక్షి-యీడుమీఱినున్నది ॥ ॥పల్లవి॥
ప్రీతితోడమనము-పెంచుచుండగా
నాతియావనంబు-బాగుమీఱగా
నీతనూజాబిడ్డ-తల్లియన్నయా
రీతిగారహించు-వెలయుచున్నదె॥

12 రాగం-మోహన. ఆదితాళం.

హేమ—యోచనరేమేటికి-యూరకప్రాణకాంత
తోచదువెరెయొక-త్రోవయునిందులకు॥ ॥పల్లవి॥
ఊరకయనురిని-యొద్దకునేఁబోయెద
సారెసుమంగలి-సలలితమరణము
గలిగెడు-ముదమలర ॥

అనుబంధములు.

13 రాగం-ధన్యాసి. రూపకతాళం.

జరా—కలవాణి-యిదివలదె-పలుకంగదగునె-పరితాపమగునె॥
కలకిరో-ననుబ్రోవ-జెలువార-బనుపవె॥ ॥అనుపల్లవి॥
సుందరాంగి-డెందమునఁ-గుందుమాని-యుండరింక
నందరు-మిా-రెందుకింక-సందెహము-మంధయాన॥

14 రాగం-వసంత. రూపకతాళం.

జరా—మానినీమణినీమతంబుమానవుకాదే
నేనుచనుచే మేలుసుమ్ము కానగలేదె॥
పడతిబిడ్డలనీవెమేలుగ బాలించెదవు
కొడకెయెదిగెనింకనెక్కు-కొదువయుగలదె॥ ॥౧॥

15 రాగం-తోడి. రూపకతాళం.

దీపక—ఇంతకీఅని-చింతయేటికి-
వంతఁజెందఁగ నేలా-స్వాంతఁబునజింతింపరె॥
పూనిచూడ-దానవుడెంత-నేనెపోయెద-నేటికిక
దీనికైయను-మానమేటికి-మానుడింకను-మదిలోననుబరితాపము॥

16 రాగం-నాథనామక్రియ. రూపకతాళం.

కుశల—తలపగ-మఱియొకచందము-కలెదెకనవలదె
తిలకింపుడుయోచింపక-విల్లసిల్లగననుబంపుడు॥ ॥పల్లవి॥
పితరులుమరి-సుఖముండిన-సుతకెకరవగునె
వెతజెందగ నేటికి నే-నతిముదమునమృతిజెందెద॥

17 రాగం-ముఖారి. త్రిపుటతాళం.

అందరు—పాప్పిదైత్యుఁడేమి తెచ్చె-బాపమనువారె లేరె॥ ॥పల్లవి॥

అనుబంధములు.

జరా—దానవుని బాధతీఱ్చి-ధర్మరీతినీపురంబు
పూనిప్రోచువారలేరె-భూమినింతయన్యాయమే॥
హేమ—ఎంతపాపకృత్యమయ్యె-యెవ్వరిని వేడుదము
వంత చెందిస్వాంతంబున-జింత చేసిఫలమేమి॥
కుశ—రక్కసుని యొద్ద కేగి-యక్కజంపుభక్తిమీఱ
మిక్కుటంబుగాను వేడి-మ్రొక్కుకొన్న మేలౌనెమొ॥
దీప—దనుజుడెందునైనగాని-కనికరంబుచూపువాడె
మనసురాయిచెసియెట్లో-మనముపోవవలెగాదే॥

18 రాగం-బేహాగ్. ఏకతాళం.

అందరు—సంతసింపజెసె నెడుగా దేసుదినము-కాదెసుదినము-
నెడుగా దెసుదినము॥
జరా—ఘనమగనెడె-మనసునదీఱె-ననుమానమెల్ల-
నెడుగా దెసుదినము॥
హేమ—వెరవునదీఱె-గురుతరమైన-పరితాపమెల్ల నెడు॥కాదెసుదినము॥
దీప—మెండుగసమ్మోదము-నిండగనలరె-బెండిలిమరణము ॥కాదె॥
కుశ—కుడుకొనియందఱు-మడసిన-శోకముబడువారలెరునెడు ॥కాదె॥

19 రాగం-కల్యాణి. రూపకతాళం.

దీపక—ఎంతసంతసంబయ్యె-నెమిచెప్పుదు॥నాకెంతసంత॥
నింతైనను-దలిదండ్రులు-ఏఱుఁగరైరె నాశక్తి॥
బకదానవునెదరించెద-పాదాహతిమడియించెద
నికసీపురివారికెల్ల-నింపునించువాఁడనేను॥

20 రాగం-ఇంగ్లీషునోటు. ఏకతాళం.

శ్రీక—నిలుమునిలుమా-బకదానవుఁడా
తెలయంజూడుమ-యోధుఁడ నే॥

అనుబంధములు.

కనుగొనుమి దెనిను-యమునిపురంబుననిల్వంగా
గలరా-దనుజా-లేరా-రారా-ననుదోడరంగనులేలేరా ॥ ॥౧॥
పురమునగలజను-లరుదుగసంతసమొందంగా-పొట్టన్
బగులన్-చీల్చున్-లేరా-జరజరనీడ్చెదనేడరా ॥ ॥౨॥

21 రాగం-కమాజు. ఆదితాళం.

అందరు—అరికులదమనా-మంగళం-బలికులదమనా ॥మంగ॥
కరుణించి-మమ్మెల్ల-నరుదగురీ-తినిసరసి
పాలించితి-గురుభుజసారా ॥మంగళం॥
ఘన-తరాద్భుతసుక్రమా-దిన-
కరాంచితవిక్రమా-(నెమ్మది) గనికరమే
లలిమనిపితిసన్మనోవిచార ॥మంగళం॥

22 రాగం ఖ్మాజు. అటతాళం.

స్త్రీలందరు—రావె చెలీ-కృష్ణుజూడ-బోదము
ఏ-లావివాదము-కదలవేలా-యేలావివాదము ॥ ॥పల్లవి॥
మనోజరూపుడే-మహానుభావుడె
దినేశతేజుడే-దేవదేవుడే
వినీలకాయుడే-వేదాంతవేద్యుడే
ఘనాబ్జనేత్రుడే-కంజనాభుడే ॥
వల-పెల్లనాతని-కమ్మితిమి
చెలియా-వల్లభుండనినమ్మితిమి
కలికీ-యెల్లసమయములందున్ ॥
విలాసయుక్తునిన్-బలారిసక్తునిన్
ఖలారిమర్దనున్-బలాజనార్దనున్ ॥

అనుబంధములు.

చూతుమెనె-డీప్సితంబు-దీరగా
చూపులకింపరగా ॥ పదవె చెలీ
చూపులకింపరగా ॥ రావె చెలీ ॥

23 (నాట్యముపాట) రాగం-కాపి. అటతాళం.

అందరు—బళిప్రాణ-కాంతమనసున-నంతకనలున-
నింతగనాడితివే-బళిప్రాణ ॥ ॥పల్లవి॥
చింతచె-నన్నమునిద్రయునే-నింతయును
జెన్నార(గాగాననె ॥ బళిప్రాణ ॥ ॥అనుపల్లవి॥
వింతవంత-మేకొని-యాకొని-వెతువ
దాకనేనీకయి-వేకరితిగా ॥ బళిప్రాణ
వేచివేచి-కందోవలవి-చెందోవలయి-డెంద
మునను-సందెఱు(గక-కుందికందితిగా ॥ బళిప్రాణ ॥
మానసనాయకా-మానదాయకా-ప్రాణనాయకా
దీననైతినే-ప్రూనిభీతినే-మాననైతినే ॥ బళి॥
చెన్నలరారగ-నన్నిటుచేరగా
చిన్నెలతీపుల-తిన్ననిచూపుల
యున్నతిసొంపగ-సన్నుతినింపగ
మొన్నటినుండియు-నెన్నకవెండియు
గన్నులజూడక-మన్ననలాడక-యున్నవుగా॥ బళి॥

24 రాగం-కనదకుతూహల. ఆదితాళం.

అంగా—ననుజేరినవా(-డెవ్వా(డురా
నాశక్తియిం-తరయు(డుగా ॥ ॥పల్లవి॥
తనప్రాణములనాశింపక-చెనక(గనెంచినవ(డొన్నరా ॥ ॥అను॥

అనుబంధములు.

ఉపే—నిలునిలు రారా-కయ్యమునకు
నీగర్వము నే-నణంచేదరా ‖ ‖పల్లవి‖
వెలసితినిం డెకదనకుతూ-హలమున్న నాతో బోరడరార‖ ‖అను‖

అంగా—దొంగ బాపడ వెంతటిబల్ - వెంగలివిరా
మెఱుగవ్రన-న్నంగారపర్ణుడను పేరునింత
యూరయగలెవె-యూరగర్వము ‖ ‖౧‖

ఉపే—సంగరంబున-జెండాడినీ-శక్తినంతయు
నణగింతునె-నంగారపర్ణు-నకువారిపర్ణు
డయ్యెదనింక-జక్కగానిల్వరా ‖ ‖౧‖

25 రాగం మాలకోస. ఆదితాళం.[1]

గుండప్ప—సొగకన్నాలదానా-యిన్నాల్లుసూసిం దెకాదె ‖ ‖పల్లవి‖
నీయన్నాలవ్రూరకుండ లేవె ‖సొగ‖

2 భార్యలు—బలుతమాసగాడా-దిమాకు సేస్తావ్రగాదా ‖ ‖పల్లవి‖
మాకుమాకుజగడ మెలేదె ‖బలు‖

గుండప్ప—మీకాల్లకు మొక్కేలేరె
భార్యలు—మేముసల్లగాబతికుండారాదే
గుండప్ప—మంచిపిల్లాలుసిక్కితిరినాకు
భార్యలు—మంచికుల్లాయియేస్తివిమాకు
గుండప్ప—నే-నొల్లాను-వ్రూరొక్కండి-తాల్లానె-మీతో ‖సొగ‖
భార్యలు—మా-కొల్లాము-పానాలుపోతాయిగాదె ‖బలుతమ‖
భార్యలు—బలునిండాభయముపడుకొని-
గుండప్ప—ఔరగుంజేలుపగిలించుకోని-

అనుబంధములు.

భార్యలు—మంచికుండాలు సేస్తుండామె-

గుండప్ప—తుంటముండాలుకూస్తుంటారె ॥

భార్యలు—బా-గుండామే-నీవేల-యిట్లాంటావు-

గుండప్ప—మీరు-రుండారె-యింకేల-నా-జోలి-హా-హా ॥సాగ॥

భార్యలు—బలుతమా॥

26 రాగం-మాండు. ఏకతాళం.

భార్యలు—నూ సేకి బాగుండాలె-నూడేవయ్యా-
మాకుమోసెన్ని సొమ్ములింకయిప్పించే ॥ ॥పల్లవి॥

కొమారుడు—బూటాలఅంగీలు_పేటాలు సల్లడాలు
మోటారుబండి-నాకిప్పించె ॥

గుండప్ప—కూకోరిసాలుసాలు-కోరెలుకోరితిరి-
మాకేడసిక్కుతాయి-యివియల్ల ॥ ॥పల్లవి॥

భార్యలు—వొయ్యమేము-సూడబోవలె-

కొమారుడు—నాన్న నాకు-నేడెయీవ్వాలె-

గుండప్ప—యన్ని మీకు-యేడతేవలె ॥కూకోరి॥

1వ భార్య—బంగారుకడియాలు

2వ భార్య—రంగారుజాజుబందుల్_

కొమారుడు—వుంగరమునాకుకావాలె_

గుండప్ప—సంగటికిసిక్కినంక-సడుగులునిల్చినంక-
యింగేమియెన్నైనయిస్తానె॥కూకోరె॥

భార్యలు—సాయమ్మరం-నేడే-సాగింఢాదిగా-
వొయ్యమేము-నూణ్ణకేపోతాం॥

అనుబంధములు.

మంచి-రేసాలుయేసోని-సొగసూగ
కులుకుంట-కుశాల్తోపోతాం-సూణ్ణికి ॥

గుండప్ప—మీరుకుల్కా తెకు లేక రు-కొంపంతపడాతాది
పక్కేకిరేమొస్నెవ్వూరోరి ॥

కుమారుడు—ఓ_నాయానా_యట్లాసంబరం-యెన్న డూరావాలె
నేనుపోతా పెండ్లింట్లోకి-
నేడుమాకం తాను-జేసుగను-సంతోసముకలుగ ॥

గుండప్ప—వ్వూరకుండు-కురోడా-బీదలముయెరోడవునీవుగ ॥

భార్యలు—మీసముల్యా-రోసముల్యా

గుండ—కాసుకుల్యా-బువ్వకుల్యా-నాక్యాడసిక్కుతాయి-యివియల్లాకూకో ॥

27 రాగం-శంకరాభరణం. ఆదితాళం.

ఉపే—యోచింపరాదెమారుతీ-ఇదితోచదెమదిలో ॥ ॥పల్లవి॥

ఇన్నాళ్లునగ్రజు-మన్ననగాంచిన
యున్నతిమానెదె-టున్నకయన్నా ॥ ॥౧॥

అవసీశునానతి-జవదాటువారమే
చివరకునీగతి-జేయగదగునే ॥ ॥౨॥

28 రాగం-హిందుస్తాని కమాజు. అటతాళం.

ద్రుప—నే-వినజాలనింక-నాభావమునెంతో-సంతాపమా ॥
నేయువార్తలెల్లమహా-పాయరీతిజెందియయో-
పోయియున్నవారె-సచివపోయెనాకీర్తి ॥

29 రాగం-యదుకులకాంబోజి. ఆదితాళం.

ఉపే—వరిపాలింపుమోజననీ_యిలాగనగమది
జాలావరుదా-లాలింపుసందేహమేలాకలిగె ॥ ॥పల్లవి॥

అనుబంధములు.

ఏదారినెంబైన-భేదముకలుగునె
నైదోడులకుమాకు-నీదయయుండఁగ ॥

30 రాగం-పూర్వికల్యాణి. ఏకతాళం.

ద్రుప—ఘనకార్యము-కడిగిచేసెను
కనుగొనువారి-మనసురంజిల్ల ॥ ॥పల్లవి॥
చరయంత్రమున-దిరుగుమీనము
నరరె యొకటే-శరమున నెసి ॥ ॥౧॥
అగణితమహా-శుగవిద్య నెంతో
పొగడంబడెనీ-జగతీసురుండు ॥ ॥౨॥

31 రాగం-కాంబోజి. ఆదితాళం.

ఉపే—కోరజాలుదనే-రాజచంద్రా
తీరునెనాకీ-నారినిగొనఁగ ॥ ॥పల్లవి॥
అన్నలు పెండిలి-యాడకమున్నే
కన్నియగోరఁగ-జన్నెధరేశా॥ ॥౧॥

32 రాగం-దేవగాంధారి. ఆదితాళం.

ద్రుప—కొనుమింకనీ-రమణి। ననుమానము-వదలి ॥ ॥పల్లవి॥
మెన్న లేనిరీ-తినినీయన్నలె। ఘనదయతోడ-ననుమతించిరి ॥అ॥
ఉపే—ఎన్నఁజాలనే-తరుణి-నన్నలుండనీ-కరణీ ॥ ॥పల్లవి॥
మన్ననంబుతో-నన్నలెంతనిన-పన్నుగాదు
నాకు-నన్నుమన్నింపుము ॥ ॥అనుపల్లవి॥
ద్రుప—ఘానురేంద్రయిది-పొందుగాదుచూడ
భానురాంగిపాణి-పట్టకుండుట
నీసతీమణి-నిటువిడనాడ
వాసిగల్గదెందు-వలధనరాదు ॥ ॥౧॥

అనుబంధములు.

ఉ. పే.—ధారుణీశ మది-దలపోయుమింత
వారుదయమీఱ-బలికిరిగాని
కోరిచూడబంధు-కోటిలోననున్న
వారునన్ను మెచ్చు-వారెకూడదిది ॥ ॥౧॥

33 రాగం-సౌరాష్ట్రం. రూపకతాళం.

గుండప్ప—పాప మేమిచేసినాను-పట్టి తెచ్చిండారునన్ను
మాపట్యాలమీ రెయిం దె-చూపికూకో పెట్టిండారు ॥
బాపనోళ్లునిన్నయింటి-వద్ద వేడిరింత-చోటు
చూపినందు కెంత శేసి-సుద్ది చెప్పిండారో సామీ ॥

34 రాగం-సౌరాష్ట్రం. ఏకతాళం.

1వ బ్రాహ్మణ—మా-బాపలతో సరిరారూ
ధర-ణీపతులుమరియెవ్వారు ॥ ॥పల్లవి॥
ఎంతటిప్రభావ-మెంతటి తేజ
మంతటిరాజులున్నా రె-యెంతంత వెదకిననీభూమి ॥
ఇక్కడ వేదవిద్య-యిక్కడధనుర్విద్య
దిక్కులనించితిమేలా-మరి పెక్కుమాటలనాడంగా ॥

35 రాగం-హిందూస్తాని-జంఝూటి. ఏకతాళం.

గుండమ్మ 1వ భార్య } నాకొంపకూలించిరే-ఈ బాపినోళ్లు ॥
సామితో వశ్శి-యేమే మో శెప్పి-
నా మొగొనిపట్టించిరే-యీ బాపినోళ్లనయ్యాల్ ॥
బాపనబట్టలు-నా పెద్దలనుకొంటి
పాపాత్ములై పోయిరే ॥ ఈ బాపన్నబట్టాలు ॥ ॥నాకొంప॥

అనుబంధములు.

86 రాగం-సౌరాష్ట్రము. ఏకతాళం.

గుండప్ప—నా కెంత సంతసము-నీ కెంత సంతసము
కూకొండిబోం చెతా మేవయ్యా ॥
గుండమ్మ—అట్లనా॥ కూకుండిబోం చెత మేవయ్యా ॥నా కెంత॥ ॥పల్లవి॥
గుండప్ప—మేడాలుబంగారు-గోడలుకట్టేము-
గుండమ్మ—నూ డెవయాం మనకీ డెవ్వరు
గుండప్ప—మనకీ డెవ్వరె॥ లేరు లే రెవ్వరు॥ లే రెవ్వరు- లే రెవ్వ రే ॥నా కెంత॥
గుండప్ప—బాపినోళ్ళె- (గుండమ్మ)- ఇదిచూపినోళ్లు
గుండప్ప—బళి-నా పేరుగా-వాడి-చూ పేరుగా
గుండమ్మ—చింత బాపిరిగా- బాగ్యమేపారెగా
గుండప్ప—భాగ్యమేపారెగా ॥ మెపారెగా-రేమేపారెగా ॥భళి నా కెంత॥

—: మంగళం :—

87 రాగం-సౌరాష్ట్రము, ఆదితాళం.

శ్రీనాయకా-జ్ఞానాదికా-దీనవనా-మంగళం
నానావిధా-నూనావతా-రానందానా-మంగళం ॥
మంగళకోట్యంగజశు-భాంగేందిరా-
సంగాంచితా-రంగదపాంగాఘనకరుణా-
సంగతసజ్జనభవతరుణా-సా-రంగావన
జలజాయతనయన-శృంగారా-రామకృష్ణపూజితా ॥శ్రీనా॥

———:o:———

బళ్ళారి రమావిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

క్రయమునకు సిద్ధముగానుండు గ్రంథకర్త గారి నాటకములపట్టిక.

పాదుకాపట్టాభిషేకము (అచ్చులోనున్నది).

బృహన్నల (ఉత్తరగోగ్రహణము).

చిత్రనళీయ నాటకము.

చంద్రహాస నాటకము.

ముక్తావళి నాటకము.

సావిత్రీ చిత్రాశ్వీయము.

వరూధినీ నాటకము.

విషాదసారంగధర.

ప్రహ్లాద నాటకము.

ప్రమీలార్జునీయం.

కావలసినవారలు ఈ క్రింద పై విలాసములకు వ్రాయవలయును.

రమావిలాస ప్రెస్, బళ్ళారి.

లేక

రామకృష్ణ ఔషధశాల, బళ్ళారి.

RAMA VILASA PRESS, BELLARY.